శ్రీ

# గంగ.

సెట్టి లక్ష్మీనరసింహము,

విశాఖపట్టణము.







బీ. రామయ్యా అండు కో.,
విశాఖపట్టణము.

1915.

## శ్రీ విక్రమదేవవర్మ విరచితములు.

| | |
|---|---|
| శ్రీనివాసకల్యాణనాటకము ... ... | 0- 8- 0 |
| మానవలీచరిత్రనాటకము, కాలికో బైండు | 0- 8- 0 |
| డిటో సాధారణప్రతి ... | 0- 6- 0 |

## మారేపల్లి రామచంద్రశాస్త్రి విరచితములు.

| | |
|---|---|
| పారిజాతాపహరణనాటకము ... ... | 0- 8- 0 |
| బిల్హణీయనాటకము ... ... | 0- 8- 0 |
| కన్యాకాంబికావిజయనాటకము ... | 0- 8- 0 |
| మానవవిధి, తెనుఁగుసంధ్యావందనము ... | 0- 4- 0 |
| కథారత్నాకరము ... ... | 0- 8- 0 |

## ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణవిరచితములు.

| | |
|---|---|
| రసపుత్రవిజయము [చరిత్రనాటకము] | 0- 8- 0 |
| చిత్రకథలు ... ... ... | 0- 6- 0 |

## బులుసు పాపయ్యశాస్త్రి విరచితములు.

| | |
|---|---|
| పద్యరత్నభాండాగారము ... ... | 0- 6- 0 |
| తెలుఁగువ్యాకరణము ... ... | 0- 6- 0 |
| అజ్ఞాతవాసము [4 తరగతికి పరనీయగ్రంథము] | 0- 4- 0 |
| పిల్లలకొఱకు పద్యములు ... ... | 0- 0- 9 |
| భానుకర విలాసము [నవల, మనోహరము] | 0- 2- 0 |
| భామినీవిలాసము ... ... ... | 0- 4- 0 |
| కర్మఫలము ... ... ... | 0- 0- 6 |
| వసంతయామినీస్వప్నము [నాటకము] ... | 0- 8- 0 |

## చిలకమర్తి లక్ష్మీనరసింహావిరచితములు.

| | |
|---|---|
| పారిజాతాపహరణము [నాటకము] ... | 0- 8- 0 |
| గయోపాఖ్యానము [నాటకము] ... | 0- 8- 0 |
| సౌందర్యతిలక [రెండుభాగములు] ... | 1- 0- 0 |

శ్రీ

# గంగ.

సెట్టి లక్ష్మీనరసింహము,

విశాఖపట్టణము.



వి. రామయ్య అండు కో.,

విశాఖపట్టణము.

1915.



# పీఠిక

'తేనె సోక నోరు తీయన యగునట్లు' చదివియు చదువనితోడనే మనస్సును రంజింప జేయునదే కవిత్వము. అపూర్వమైన సంధులతోను దీర్ఘ సమాసములతోను చదువుటకే కష్టముగా నుండునట్టియు, శబ్దార్థాలంకారముల చేత బోధపరుచుకొన కష్టతరముగునట్టియు వ్రాతలు నిశ్చయముగా 'మూగ చెవిటివారి ముచ్చట' లే! శబ్దచిత్రములకొరకును, అద్భుతకల్పనలకొరకును గింజుకొనుచు వానిమీదనే దృష్టియంతయు పెట్టి గ్రంథకర్త రసపోషణమేమి చేయగలడు? చేయగలడే పో, పదములు కూడబలుకుకొనుటకును కల్పనలు బోధపరచుకొనుటకును గింజుకొనుచు దృష్టియంతయు వానిమీదనే పెట్టి పాఠకుడు రసగ్రహణమేమాత్రము చేయగలడు? నలుగురు చదివి యానందించునదే గ్రంథము; నలుగురి నానందింప జేయునదే పాండిత్యము.

సామాన్యులకు బోధపడునట్లు వ్రాయుట పాండిత్యలోపమని మన కవు లాలోచించుటచేతనే వారి గ్రంథములకు తగిన వ్యాప్తి లేదు: సామాన్యులకు సామాన్యులే గ్రంథములు వ్రాయ వలసి వచ్చినది.

అట్టి గ్రంథములయందే నిజమైనకవిత్వమున్నది; అవి చదువుచున్నప్పుడే మనస్సులయందు నిజమైన రసముత్పన్నమగుచున్నది.

అట్టి గ్రంథములలో ముఖ్యమైనది గంగావివాహము. విశాఖపట్టణము జిల్లా దేవులపల్లి తాలూకా మరువాడగ్రామములోని పసగాని సన్యాసి యను పద్మసాలి ఆ గ్రంథమును వ్రాసిన యాయన. వెనుకటి నలసంవత్సరము, అనగా రమారమి 60 ఏండ్ల క్రింద, 'హరిహరీ నారాయణా' అను వరుసను పాటగా వ్రాసెను.

ఆ పాట సీసపద్యమునకు దగ్గరగా నుండును. కథలో ముఖ్యముగా రసవంతమయినభాగము మాత్రమే తీసికొని నేనిప్పుడు సీసపద్యముగా దానిని మార్చితిని. అందుకొరకు కావలసినమార్పులును ఇంక మరికొన్ని మార్పులును ఉన్నవి. రెండు పుస్తకములును ఎదుట పెట్టుకొని చూచిన బోధపడును.

ఈ గ్రంథమందు సొగసులన్నవి ఉన్నట్లుగానే చదువరులకు తోచినయెడల అవన్నియు మొదటి గ్రంథకర్తవిగానే భావింతురు గాక!

విశాఖపట్టణము,
15 ఏప్రిల్ 1915.

సెట్టి లక్ష్మీనరసింహము.



శ్రీ.

# గంగ.

## సీసమాలిక.

శ్రీ పరమేశ్వరు చిద్విలాసము చేత
పుట్టి నిల్చి నశించు భువనతతులు.
కల్పాంతమందు లోకములు పద్నాలుగు
అణగి ఉండుట చూచి ఆదిగంగ
తనకడ్డు లేదని తరలి ఉప్పొంగుచు
నిండి పారెను లోకనిచయములను;
పర్వతంబులను భూభాగమంతయు కప్పి
చదలు ముట్టెను గంగ జలదరించి;
తన సాటి ఎవ్వరున్ ధరణిలో లేరని
ఉప్పొంగె ఆ గంగ ఉప్పరమున:
వాన పడిన యట్టి వసుధ్వస తుంపురుల్
పడె వెండికొండపై బహువిధముల:

“ఇది ఏమి విం'?” తని ఈశ్వరుం'డటు లేచి
నిలిచి గంగను చూచి తలను ఊచి,
గంగపై కోపించి గరళకంఠుడు పల్కె:
“గర్వంబు కూడదే గంగ, నీకు;
నీ సరి'యైన కన్నియ'లిల లే'రని
పొంగి మి'న్నంటెదు బుద్ధి మాలి;
పావనం'బగు విష్ణుపదముల జన్మించి
గర్వ'మొందుట నీకు గంగ, తగునె?
నీచు కంపుల'కెల్ల నిలయ'మై ఉ'న్నట్టి
జాలరి కులమందు జన్మ'మొందు:
జాలరి కన్నె'వై జన్మింప పో'," మ్మంచు
శర్వాణినాథుండు శాప'మిచ్చె.
శర్వాణినాయకు శాపంబు'కొడబడి
గడగడ వడకె గంగాభవాని:
గడగడ వడకుచు కన్నీరు పెట్టుచు
హరుని శాపము తప్ప'దనుచు తలచి,
కరయుగంబును మోడ్చి హరుని కన్గొని ఏడ్చె,
“నిటలాక్ష, శంకరా, ఇటులు తగునె?
నేర'మేమియు లేక నిష్కారణంబుగా
హీనజన్మంబు న'న్నెత్తు'మంటివే:
విశ్వమిత్త్రంబుగా నీచజన్మమ్మున నన్
పుట్టు'మనంగ నో'రెటు'లాడె?”

అనుచు గద్గదకంఠి'యయి రోదనము చేయ
సదయహృదయు'డౌచు శంభు'డనియె:
“పరమపావనిని శ్రీహరి కౌమార్త'న'టంచు
గంగ, గర్వంబున పొంగి పడితి;
ఆడుదానికి ఇంత అతిశయ'మే'లని
కోపించి నీకు నే శాప'మిడితి;
శాప'మిచ్చిన రీతి జరుగక మానదు,
మగువరో, అయినను వగవ వలదు;
నీచజన్మం'బని నీవు చింతింపకు,
పిమ్మట నిన్ను నే పెండ్లి అగుదు:
పరిణయం'బయి నిన్ను శిరమందు నిల్పెద,
గౌరిని నిను ఒక్క గతినె ఉంతు,
నమ్ము, నమ్ము'," మటంచు నాగకంకణధారి
అభయహస్తం'బిచ్చి ఆదరించె.

ఆ కాలమున'నుండె అధికసంపన్నుండు
ఏలూరిపురమందు జాలరీడు,
హరపాదభక్తుండు అతినీతియుక్తుండు
జాలరికులజుండు శంఖుదేవు'-;
డాతని కులదేవి అమృతరసపు బావి
చక్కదనపు దీవి చక్రదేవి;

జాలరి వీథుల సంచరించె:
"నా వంటి ఎరుకత' లే వంక లే'," రని
జాలరి వీథుల సంచరించె.

తోరంపు బంగారు తూగు'టుయ్యాలలో
బాగుగా గంగమ్మ ఊగు'చుండి
"ఎరు'కెరుకో!" అన్న ఎరుకత మాటలు
విని దాదిచే పిలిపించి, అపుడు
కూర్చుండగా 'పెట్టుకొని ఆదరము చూపి
ఎరుకతతో గంగ ఇట్లు పలికె:
"జాణ ఓ ఎరుకలసాని, నే'నిపు'డొక
తలపు చేసితి, దాని తప్పకుండ
సరి దాకు'నట్లుగా ఎరిగించి'నట్టిచో
ఏమి నీ'వడిగిన ఇచ్చుదాన,"
అని గంగ పలుకంగ అనె ఎరుకలసాని:
"ఎరుకతె'లెందరో ఇలను కలరు;
నాతోడ సరిగ పద్నాల్గు లోకములందు
ఎరుకను చెప్ప లే'రెవ్వ'రైన:
నా ఎరుక'నె కదా నాగకంకణధారి
ప్రీతితో గౌరిని పెండ్లి అగుట?
కైలాసగిరి'నున్న గౌరిదేవికి ఎరు-
కను తెలిపెడి ఎరుకతను నేను,

వైకుంఠమున ఉన్న వరలక్ష్మికిని ఎరు-
కను తెలిపెడి ఎరుకతను నేను,
బ్రహ్మపట్టణమున భారతికిని ఎరు-
కను తెలిపెడి ఎరుకతను నేను,
తెలియంగ ముక్కోటి దేవతలకు ఎరు-
కను తెలిపెడి ఎరుకతను నేను:
ఎరుకను తెలిపెడి ఎరుకతనే కాను
దివమందు విహరించు దివ్యసతిని;
ఎల్ల వారలును నా ఎరుక లేకుండంగ
తెలియరేదియు తేటతెల్లముగను
బంగారు చేటలోపల పోసి వేగమే
తేవమ్మ ముత్యాలు దివ్యమణులు,
వెలది, నీ కోర్కెలు వివరించి చెప్పెద
తేవమ్మ ముత్యాలు దివ్యమణులు,"
అని ఇట్లు పలుకంగ, ఆ గంగమాంబిక
తెప్పించె ముత్యాలు దివ్యమణులు.
బంగారు చేటలోపల పోసి ముత్యాలు
తన చేతితో పట్టుకొనుచు గంగ
ఫాలమునను చేర్చి పార్వతీనాథుండు
తన పతి కాగను తలచి మ్రొక్కె.
చేతిలో ముత్యాలు చేటలోపల పోసి
ముదముతో ఎరుకత ముందు నిలువ,

మాయల ఎరుకత మగువ మొక్కి గ్రహించి
దేవుల నెల్ల ప్రార్థింప సాగె:
"స్వామి, శ్రియఃపతీ, శంఖచక్రధరుండ,
అఖిలాండకోటిబ్రహ్మాండనాథ!
కాశివిశ్వేశ్వరా, గజచర్మధారుడా!
కోరికల్ తీర్చెడి భైరవుండ!
ఓ అమ్మ, ఇల్లాలు, ఓ సరస్వతి దేవి!
నాకు తోడుగ రమ్మ, నీకు మొక్కు!
జిహ్వ పాయక నిల్వు శ్రీకాళికాశక్తి!
విఘ్నముల్ తొలగించు విఘ్ననాథ!"
అని ఇట్లు వేల్పులనందర కొనియాడి
శ్రీగంగమాంబిక చేయి పట్టి,
ఇంతి సంతోషింప ఎరుకత పలికె:" ఓ
ఘనగుణనికురంబ, గంగమాంబ,
భాగ్యంబు కల చేయి, పలు ప్రతిష్ఠల చేయి,
చెలువ సంతానంపు చేయి నీది;
ఒక్క కోరిక చేసి ఉన్నావె నా తల్లి,
కాయొ పండో అంచు కలవరింతు;
కాయ కాదే పండు, కల్ల కాదె నిజమ్మ,
కొలది లోపలనె చేకూరు నమ్మ,
మగవేల్పు నీకింక మగడు కాగలడు,
గౌరియే సవతి కాగలదు నీకు;

గిరిజ నెప్పుడు క్రిందు పరచెదవే నీవు,
కరకంఠు శిర మెక్క గలవె తల్లి!
నిక్కంబు ముక్కంటి నిను చూడ వచ్చును,
వచ్చిన వెనుకను వదలడు నిను;
పెండ్లి ఆడక మరి వెడలి పోడు శివుండు,
నా మాట నిజముగా నమ్మ నమ్మ,
కల్ల లాడను నేను గరళకంఠుని సాక్షి,
బొంకు కాదిదిగో నా బుట్ట తోడు,"
అని ఎరుకత పల్క ఆనందమున గంగ
బహుమతు లిచ్చెను బహుళముగను;
చెలువ దగ్గర మాని సెల వొంది ఎరుకత
రూపు మారిచి చనె రుద్రు చూడ.

బ్రహ్మాదు లిరువంక ప్రస్తుతించుచు నిల్వ,
ప్రమథకోటులు చుట్టు బలసి కొల్వ,
పరమర్షి వర్గముల్ ప్రార్థనల్ సలుపంగ,
వామభాగమున పార్వతి చెలంగ,
కైలాసమున నున్న గౌరీశు పొడగాంచి
శరణార్థి అయి మునివరుడు పలికె:
"పాహి విశ్వేశ్వరా, భవరోగసంహార,
నిను పోలు వేల్పు నీవె సుమ్మ!

నిఖిలలోకములందు నీ 'వెనుగని' దేది?
వింటివే, ఒక వింత కంటి నేను:
ఏలూరి పురములో జాలరి వీధిలో
కంటిని చక్కని కన్నెమిన్న:
ఇంపు సొంపుల బాల, ఎన్నంగ కడు గోల,
అతిపుణ్యశీల, దయావిశాల;
తగును నీ 'కా చెలి తగుదు 'వీ' వామెకు,
కొమ్మ 'నె'ట్లయిన కై కొమ్ము దేవ,"
అని నారదుడు పల్క ఆలించి మోహించి
కనుసైగ కావించె కామహరుడు;
కనుసైగ కావింప కని ఒక 'రొక్కరు
సభలోని వా'రెల్ల చనిరి పైకి.
అపుడు బ్రహ్మాదుల'సందర వీడ్కొల్పి
కలకంఠి గారికి తెలియకుండ,
కైలాసమున ఉన్న ఘను 'లెవ్వ'రును కూడ
తాను వెళ్ళిన జాడ కానకుండ
కైలాసమునుండి గంగానివాస'మా
ఏలూరి పురమున 'కేగె హరుడు.

కలియుగస్వర్గ'మై కనుపట్టు ఏలూరు
వెళ్ళి జాలరి వారి వీధి వెదకె;

దేవకియు జాలరి వీధి కానగ లేక
నిటలాక్షుఁడచటి కోనేటికరిగి,
నీలాటి రేవున నిలిచి ఆ చోటికి
నీటికై వచ్చు కన్నెలను చూచి:
"ఓ భామలార, ఈ ఊరిలోపల ఉన్న
జాలరి వీధి ఎచ్చటు?" అనంగ
విని కాంత లందరు విశ్వేశు పొడగాంచి
వినిపించి రతనికి వీధు లెల్ల:
"ప్రత్తి చెట్టున్నది బ్రాహ్మణుల్ కల వీధి,
చందనం బున్నది క్షత్రియులది,
కొబ్బరి చెట్లది కోమట్లు కల వీధి
జాజి చెట్లది శూద్రజాతి వీధి,
తులసి చెట్లున్నది దొడ్డ వైష్ణవవీధి,
బిల్వ ఉన్నది శైవవీధి, మరియు
సంపంగె ఉన్నది సాని వారల వీధి,
జమ్మి చెట్టున్నది జాలరులది,"
అని ఇట్లు వేర్వేర అన్ని వీధుల గుర్తు
విన్నవించిరి స్త్రీలు విశ్వపతికి;
విని వామదేవుండు ఘన మోదమును పొందె.
అంతలో సూర్యుఁడస్తాద్రికరిగె:
పక్షులు తమ తమ వృక్షంబులకు చేరె,
సంజ చీకటి క్రమ్మె జగము నిండ,

ముకుళించె తామరల్, వికసించె కలువలు,
వినువీధి తారకల్ వెలుగ సాగె,
జగము తేట పడంగ చంద్రోదయం'బయ్యె,
పండు రే'యెండలు నిండె మింట.
అపుడు శంభుడు తన ఆకారమును మార్చి
క్రొత్తగా జంగమ రూపు తాల్చె:
కడు వృద్ధ వేషంబు, మెడను రుద్రాక్షలు,
పులి తోలునున్, కమండలువు, మరియు
కురుచ కెంజడలును, కుచ్చుల బొంతయు,
భసితపుండ్రము, కక్షపాల, మరియు
ఒక చేత కప్పెర, ఒక చేత గంటయు,
గొడుగు వీపున, పావుకోళ్ళు కాళ్ళ,
అలర పురిని చొచ్చి అట మాయ జంగమ
వేషంబుతోడ కావించె భిక్ష.
గంట వాయించి శంఖం'బూదుకొనుచును
జాలరి వీధికి చనియె శివుడు;
ఆ రీతి భిక్షంబు అడుగుచు శివయోగి
శంఖుదేవయ ఇంటి సరస'కేగె.
"భిక్ష!" అంచు శివుండు పిలువగా వేగమ
కలహంసగమన గంగాభవాని
ఊగుచు బంగారు తూగు'టుయ్యాల దిగి
అడుగుపాటునను ఒయ్యారి గంగ

కరకంకణావళుల్ గల్లు గల్లు'మనంగ
మెరుపు విధాన నెమ్మేను మెరయ
సఖి సకలపదార్థసంపన్న'మై'నట్టి
అన్నంబు భిక్షగా హరుని'కొసగె;
భిక్ష కొని శివుండు పిలిచిన పలుకక
"శివ! శివా!" అని పోయె శివు గుడికిని.
జంగమనాథుండు సాగి పోవుట చూచి
గంగమ్మ చాలగా కలవరించె:
"ఇది ఏమి? దైవమా, ఈ జంగమవిభుండు
మాటాడ'కుండనే మరలి పోయె!
నిలువ'డయ్యో! ఒక్క నిమిష'మైనను కాని
ఇరుగు పొరుగు భిక్ష ఎత్త లేదు!
చాలును అన'డయ్యె చాలదు అన'డయ్యె,
భయ'మేమి తన'కిల్లు పారిపోవ?
జంగంబు కా'డహా! సాక్షాత్తు శంభుం'డె,
నను చూడ వచ్చిన నాథు'డితడు;
జంగం'బె అయినచో సన్నసన్నగ పోడు,
నిజముగా జంగంబు నీలగళు'డె;
నాగకంకణధారి రా గల'డంచును
చెలి ఎరుకత మున్ను చెప్ప లేదె?
నాకు దర్శన'మిచ్చి నాథుండు నా మీద
అలిగి'నట్టులు చనె అతిరయమున;

పతి లేని ఈ భోగభాగ్యంబు లే?" లని
తల్లడం బందెను ధవళనయన.
ఈ మాడ్కి చింతించి ఏమియు తోచక
తల కట్టుకొని గుండె దడదడ మన
మాపు మూల నులక మంచంబుపై బాల
నిండు ముసుంగుతో పండి మూల్గె.
"చాల రాతిరి అయ్యె, బాల తిండికి రాదు,
ఆకలి, గడియయు ఆగ లేదు;
ఇంత సేపాయెనే! ఏల రాలే?"దని
చక్రమ్మ గుండెలు జల్లు మనగ,
అందంతు తిరుగుచు అన్ని చోట్ల వెదకి
పవళించి ఉన్నట్టి బాలను కని,
"ఇది ఏమి? నా తల్లి ఈ రీతి ఉన్నావు?
ఎవ్వ రేమనిరి? నీ కేమి లోటు?
అన్నంబు మాని నీ వలు కేల చేసితి?
మరుగు పెట్టక నాకు ఎరుగ జేయు;
ఇపుడు వచ్చిన జంగమేశ్వరు పొడగాంచి
జడిసికొన్నావేమొ? చక్కనమ్మ!
అమ్మ, నేనుండంగ ఆ జంగమయ్యకు
భిక్ష ఏటికి నీవు పెట్ట బోతి?
వెర్రి జంగము చూచి వెరచుకొన్నావేమొ?
తల్లికి బిడ్డకు దాపు కలదె?

తెప్పైన ఒప్పైన తల్లితోడను బిడ్డ
    తెలుప వచ్చునె యన్న పలుకు వినవె?
ఆకు చాటున పిందె అమరి ఉన్న విధాన
    తల్లి చాటున పిల్ల దాగి ఉండు;
నేను తల్లిని గనక నీవు దాచక చెప్పు
    నీ కోర్కె తీర్చెద, నిక్క," మనిన
సిగ్గున భయమున చెప్ప చాలక గంగ
    చివరకు తెగువతో చెప్పసాగె:
"ఓ తల్లి, చక్రిమ్మ, ఓర్పుతో వినవమ్మ
    నీకు చెప్పక తీరునే ఎట్లైన?
నీవు చెప్పగ వలె, నీవె కూర్పగ వలె,
    నీకు మించిన వారు నాకు కలరె?
గర్భవాసమున నన్ కన్న తల్లివి నీవు,
    తప్పు చేసిన నీదె, ఒప్పు నీదె;
ఈ వీథి భిక్షంబు ఇప్పుడెత్తినయట్టి
    జంగము దేవర శంకరుండు,
నా మీది వలపుచే నన్ను కన్గొనుటకై
    ఏతెంచి భిక్షంబు ఎత్తి చనియె;
పాడు గుడిని చేరి పరమేశుడున్నాడు,
    అతని నాతో కూర్పవమ్మ వేగ;
జంగమయ్యయటంచు సందేహ పడినచో
    విడిచెద ప్రాణంబు విషము త్రాగి;

అతనిపై నాకాశ అధికమై ఉన్నది,
జంగమయ్య అంటన్న శంక వలదు,”
అని గంగ పలుకంగ ఆశ్చర్యమును పొంది
పట్టితో చకితమ్మ ఇట్టులనియె:
“ఏమి, నా తల్లి నీవిట్టి మాటాడెదు?
ముష్టి జంగము మీద మోహమేల.
మాయ జంగము వాడు మరులు కొల్పెను నిన్ను,
పొలతిరో, నీకిది బుద్ధి కాదు,
వలపు రూపంబును తెలియదన్నట్టి సా-
మెత నీవు నిజము చేసితివె తల్లి?
కులములో మనలను వెలివేసి తప్పు తె-
మ్మందురు గద ఒక నందో, వేయొ?
తప్పుతో సరిపోదు, తప్పక మన సరి
వారలలో తలవంపులు గద?
కక్కుర్తి పడినను కడుపును నిండదు,
కీర్తి పోగొట్టు కక్కుర్తి ఏల??
కులములోపల చాల గొప్పవానికి నిన్ను
ఇయ్యంగ వలెనని ఇచ్ఛ మాకు;
కులము వానికి మాని కూళ జంగానకు
నిన్ను ఏ గతి కూర్ప నేర్తుమమ్మ?
అబల, నీవెక్కడ? ఆ జంగమెక్కడ?
నవ్వరా? ఇటు కోర న్యాయమౌనె?”

అని తల్లి పలుకంగ అదరెడు గుండెతో
గంగమ్మ తల్లిని గాంచి పలికె:
"జంగ'మాతడు కాడు, సాక్షాత్తు శంభుండు,
నా నాయకుండు, నా ప్రాణవిభుడు,
పారెను ఆతని జంగము వాడని
పలుక బోకమ్మ పాపంబు వచ్చు;
నను చూడ వలె'నంచు మనమున ఊహించి
అరుదెంచిన శివుండె అమ్మ, అతడు;
నా మనవిని విని నా ముద్దు చెల్లించు,
న'న్నాతనికి అర్పణం'బొనర్పు;
అతనికి నన్ను నీ'వర్పింప'కుంటివా
విడుతు ప్రాణములను, వేయు ఏల?"
అని బిడ్డ పలుకంగ "అయ్యయో!" అనుచును
బాలికామణితోడ పలికె తల్లి:
"నా తల్లి, నా అమ్మ, నను కన్న తల్లిరో,
బాలవు, నీ'కింత పంత'మేల?
మాయ జంగమువాడు మరులు గొల్పెను నిన్ను,
నాగకంకణు'డని నమ్మినావు;
నిజముగా జంగము నిటలాక్షు'డైనచో
అయ్యో! నీ సౌఖ్యము అడుగ వలెనె?
హరునితో సంసార'మది ఎట్లు'లుండునో
వినిపింతు శ్రద్ధతో వినవె తల్లి:

పెట్టు సొమ్ములు లేవు పెను పాములే కాని,
పుయ్య గంధము లేదు బుగ్గె కాని,
కట్టు బట్టలు లేవు గజచర్మమే కాని,
తినగ కంచము లేదు పునుకె కాని,
ఎక్క వాహనము లేదెద్దు గుర్రమే కాని,
ఉండ కొంపయు లేదు కొండె కాని;
కసు వెక్కితో వల్లకాట త్రిమ్మరు, ఊరి-
లో భిక్షయును గుడిలోన నిద్ర;
కులమన్నదియు లేదు, గోత్రంబు లేదు; తా-
మసుడు, రుద్రుడు, కడు ముసలివాడు;
కడుపు కక్కుర్తి గుర్రడు విషంబును మెక్కి-
యును అర చిక్కిన ఒడలి వాడు;
సొగసు చూడగ బోవ ఎగు దిగు కన్నులు,
మెడ చుట్టు నలుపును, మేన బూది,
తలయెల్ల జడలును, తనువెల్ల బూడిద,
గుండెపై పుర్రెల గుత్తళంబు!
బాలరో, నీ వెర్రి బంగారమై పోను!
ఇట్టి వానిని ఎట్టులెంచుకొంటి?
కన దొండపండును కాకి ముక్కుకు కట్టు
గతియె వానికి నిన్ను కట్టి పెట్టె!
లోకంబులకు దైవమే కాని బ్రతుకు సు-
ఖంబు ఏమియు ఎరుగడు కదమ్మ;

అది కాక పార్వతి అతనికి ఇల్లాలు,
సవతి పోరును పడ శక్య'మౌనె?
ఎన్ని భాగ్యము'లున్న ఎంత సౌఖ్యం'బున్న
సవతి పోరును పడ శక్య'మౌనె?
పది వేలు కలిగిన పది లక్ష'లున్నను
సవతి పోరును పడ శక్య'మౌనె?
సవతి ఉన్న బ్రతుకు సతి'కెప్పు'డును దొంగ-
తన'మే సుమీ దొరతనము కాదు:
దొప్ప క్రిందను చేరి దోసిలి ఒగ్గిన'-
య్యట్టు'లే సుమ్మ ఏరాలి బ్రతుకు;
వనితరో, భువిలోన వ్రతము చెడిన సుఖ'-
మైనను దక్కంగ'నోను సుమ్మ;
సుఖము లేని బ్రతుకు, సున్నము లేని వీ-
డెమును, కలువ పూలు లేని కొలను,
దీపము లేని మందిరము, వెన్నెల లేని
రాత్రియు మిగుల వ్యర్థములు కావె?''
అని తల్లి చెప్పు'చున్నంతటిలో కోళ్ళు
కొక్కొరోకో అని కూయ సాగె,
చూచు'చుండ'నె వేగు చుక్క'యు దూరెను,
కావు కా'వని కూసె కాకి మూక,
తూరుపు తెలు'పారె, తారకల్ కళ తప్పె,
కమలముల్ విచ్చె, లేగాడ్పు వీచె.

నెలతపై వలపున నిద్ర కంటికి రాక
పాడు గుడిని ఉన్న పరమ శివుడు
తెల్లవారక ముందె వెళ్ళి జాలరి వీధి-
యందు, "భిక్షో," అని అరువసాగె.
చక్రిమ్మ అది విని జలదరించుచు పయి-
కేగి జంగమునకు ఎదుట నిలిచి:
"జంగమయ్యా, ఇట్లు జాలరి వాడలో
భిక్షంబు నడుగుట ప్రియమె నీకు?
కక్కుర్తి వాడవు కాని, కాకున్నచో
జంగమయ్యల కిది చందమగునె?
మా చేతి కూటిపై మనసు పారెనె నీకు?
చేప పొలుసుల కంపు చేయి మాది,
నీచు కంపులకు తావౌ చేయి మాయది,
చెడు కుళ్లు కంపుల చేయి మాది:
ఈ కంపు కూటిపై ఎటు బుద్ధి పుట్టె? ఓ
మిండ జంగమ, ఇది మిషయె కాని,
మటు మాయ జంగాలు, మాయవాదులు మీరు,
మతములో నొకటియు మసలు టొకటి:
మరులుతో తిరుగుచుందురు మిండ జంగాలు,
మచ్చుమందుల వారు, మాయ వారు;
జాలరి వీధికి సారెసారెకు నీవు
పరుగెత్తి వత్తువు పాలు మాలి;

మరి మరి నిను చూచి మా చిన్ని పాపలు
వలచి నీ వెంటను వత్తు'రనిరొ!
పట్టణమం'దెల్ల పట్ట రాదా భిక్ష?
చాలదా కడుపు నించగ అ'దెల్ల?
వ'ద్దన్న చోటికి వాదించి వత్తువు
కద! ఎటువంటి జంగా'న'వయ్యా?
కన్న పాపలు నిన్ను కని బెదరెదరు, రా
దగ'దయ్యా నీ వంటి సొగసుకాండ్రు;
మాటను కాయుట మర్యాద కా'దయ్యా,
వేంచేయు మాట దక్కించుకొనుచు,"
అని ఇట్లు చక్రమ్మ తనతోడ పలుకంగ,
మాయా జంగము పల్కె మగువతోడ:
"జంగంబులను చూచి సకలజనంబులు
తండ్రి భావంబుగా తలప వలెను;
అది మాని పొ'మ్మంచు అల్లరి చేసెదు,
ఏమి చేసితిని నీ'విట్లు తిట్ట?
కడు'పే సముద్రంబు కద! గన్క జంగమే-
శ్వరులును కడుపు'కై తిరుగ వలసె,
తిరుగు'మంచును వ్రాసె పరమేష్ఠి జంగమే-
శ్వరులకు, గనుకనే తిరుగవలసె:
వీథివీథులయందు భిక్షంబు'నెత్తుచు
తిరుగు'టే జంగమేశ్వరుల వృత్తి;

తప్పినాడను తల్లి, దయ ఉంచు నామీద,
మరియాద ఎరుగని నడత కాను;
నన్ను మోహించి కన్యలు వెంటబడుటకు
నా సొంపు పెంపేమి? నవ్విపోరె?
ఉన్న ఇల్లాలిని ఒకతెనే పోషింప
దేశదేశంబుల తిరుగుచుంటి;
ఇక వచ్చువారు మరేమి అనుభవింప
వలెనని నను చూచి పలుతురమ్మ?
నా వెంట ఎందరు నారులు వత్తురు?
జోలెలో ఎందరు స్త్రీలు కలరు?
జడలలో ఎందరు జలజాక్షులున్నారు?
చంకలో ఎందరు సఖులు కలరు?
నా రూపు నా రేఖ నను చూచి పోలేక
తగులుకొందురె నన్ను తరుణు? లహాహా!
నా బొల్లి దేహంబు నా అందమును చూచి
మరులుకొందురె మీదు మగువ? లహాహా!
పడుచుతనంబున బ్రహ్మహత్యను చేయు
పుట్టె దేహమున ఈ బొల్లి నాకు:
మేలైన అడివాకు మేనిపై చమిరినన్
పొలతిరో, ఈ బొల్లి పోవ లేదు,
కుమ్మరి బూడిద నెమ్మేన చమిరినన్
పొలతిరో, ఈ బొల్లి పోవ లేదు,

చేసు విషంబు ఆ మీదను మ్రింగినన్
ఫాలతిరో, ఈ బొల్లి పోవ లేదు;
సకల దేశములందు సంచరింపక కాని
పోదు పాపం'బని బుధులు చెప్ప,
బ్రహ్మహత్యను కల్గు పాపంబు పోవంగ
జంగమ'నగుచును సంచరింతు;
ఇంతి'యే కాని నే'నితర'మెరుంగను,
దూర'నాడక్కె తల్లి, ద్రోహి కాను;
వనితరో, ఇంక నీ వాకిలి చేర, నీ
ఇంటను భిక్షంబు ఎత్త రాను,"
అని పల్కి శంకరుం'డా చోటు విడిచి, శి'-
వాలయంబును చేర'నరిగె మరల.

తల్లి చెప్పిన మాట'లెల్లను చెవు'లార
విని హృదయము జల్లు'మనగ గంగ
ఈ గతి తలపోసె: "నాగకంకణుని నా
తల్లి నిల్వగ'నీక తగిలి వేసె;
నామీది ప్రేమచే నను చూచు కోర్కె తో
పని పూని వచ్చె ఆ పరమశివుడు;
పార్వతీపతి మీది భ్రమ పాయగా లేను,
నీలకంఠుని పాసి నిల్వ లేను;

ఏమి చేయుదు? అయ్యో! ఇంతకు నా తండ్రి
అధికారి ఉన్నాడు అన్నిటికిని;
నను పెండ్లి చేయగా జనకుం'డె కద కర్త?
అతనికి తెల్పుదు అభిమతంబు;
చెప్పెద నా కోర్కె, సి'గ్గేల? చల్లకు
వచ్చి ముంతను దాచు వారు కలరె?
కొలిచెడి వారికి కొంగుబంగారము,
గౌరీశు'డల్లుడు కాగ తగడ?"
అని గంగ తలపోసి జనకు దగ్గర చేరి,
తల వంచి సిగ్గుతో పలికె ఇట్లు:
"జాలరివంశాబ్ధిచంద్ర, ఓ గుణసాంద్ర!
నా తండ్రి, నాదు విన్నపము వినుము:
నిన్నటి రాతిరి నీలకంఠుడు వచ్చె
ప్రియముతో మన ఇంట భిక్ష కొనగ;
భిక్షను కైకొని పిదప మా'టాడక
పరు'గెత్తుకొని పోయె పాడు గుడికి;
తరువాత ఈ పొద్దు తప్ప'కుండగ వచ్చి
ఈ వీథి భిక్షంబు ఎత్తు'చుండ,
ఆతని పొ'మ్మని మా తల్లి తిట్టగా,
మారు మా'టాడక మరలి పోయె;
పాడు గుడిని చేరి పరమేశు'డున్నాడు,
అతడు జంగము కాడు, హరుడు నిజము;

నన్ను పెండ్లాడంగ నా మీది ఆశచే
జంగమై వచ్చెను శంకరుండు;
జాగు చేయక నన్ను శంభున కర్పించి
సత్కీర్తిని గొమ్మ నీవు తండ్రి,
కన్యాప్రదానంబు ఘనమైన దానంబు;
అది శివార్పితమైన, అడుగ వలెనె?
నాగకంకణునకు నను పెండ్లి కావించి
పుడమిలో సత్కీర్తి పొందు తండ్రి,"
అని ముద్దు కూతురు తనతోడ పలుకంగ,
శంభుదేవయ్య విస్తారకృపను
బాల చెక్కిలి పట్టి పలుమారు ముద్దాడి
పరమహర్షంబున పలికె నిట్లు:
"నా గర్భరత్నమా, నా తపఃఫలము, నా
సన్నిధానము, నను కన్న తల్లి,
అఖిలలోకములకు ఆధారభూతుండు,
అరయ సామాన్యుడా పరమశివుడు?
భువనముల్ పుట్టింప పోషింప త్రుంప త్రి-
మూర్తి స్వరూపంబు పూను వాడు;
మారు వేషముతోడ మన పురి చొర నేల?
నిను చూచి పరుగున చనుట ఏల?
పాడు గుడిని చేరి పడి ఉండగా నేల?
పరదేశి వలె తాను తిరుగ నేల?

దయ నిండగా నాకు దర్శనం'బీ రాదె?
కన్నె 'నిమ్మించు పల్కంగ రాదె?
తా రాక పోయిన తగు మానుష్యుల పంప
రాదె? ని'న్నడిగింప రాదె? తల్లి,
నన్న సన్నగ వచ్చి సన్న సన్నగ పోవ,
మర్యాదయే? తగు మార్గ'మా నె?
నిజముగా జంగంబు నిటలాక్షు'డై నచో
దర్శనం'బిచ్చును తప్ప'కుండ;
పాడు గుడిని చేరి బైరాగి వలె ఉండ
దేవు'డం'చేలాగు తెలియ'నగును?
జాలరి పెద్దల ఏ లాగు నమ్మింతు?
ఎట్లు ని'న్నతనికి ఇయ్య'నేర్తు?
మాయ చేసెడి వారు మహిమీద ఎందరో,
గురు'తేది అతడు హరు'డె అనగ?
నాకు నమ్మకముగా నాగభూషణుడు క-
న్పించిన నిన్ను పెండిలి ఒనర్తు;
హరు'డె నిక్కం' బన్న గురుతు తెలియ'కుండ
నిను పెండ్లి చేయగా నేర'నమ్మ,"
అని తండ్రి పలుకంగ ఆ మాటలకు గంగ
మారు చెప్పగ లేక మరలి పోయి,
కరయుగంబును మోడ్చి శిరము మీదను చేర్చి
చిత్తంబులోపల శివుని నిల్పి:

"శ్రీసదాశివ, సర్వజీవదయాకరా,
దీనసంరక్షకా, దేవదేవ,
నీవు శంభుడవని నేనెంత చెప్పిన
నా తండ్రి నిజముగా నమ్మడాయె;
నిజరూపుతో నీవు నిలువక పోయిన
నమ్మంగ చాలడు నాదు తండ్రి;
దర్శనం బీనిచో తగు వారి ఇచటికి
పంపియైనను అడిగింపు దేవ,
నగుబాటు కాకుండ నా కోర్కె చెల్లించు,
రావయ్య ఏలైన దేవ, నీవె,"

అని గంగ వేడంగ అంతరంగంబున
కరుణించి, మునుల శంకరుడు తలచె.
తలచిన క్షణమె గౌతమభరద్వాజకౌం-
డిన్యమాండవ్యాదినిఖిలమునులు
భూరికాంతులతో, విభూతి పూతలతోడ,
జడలతో రుద్రాక్షసరులతోడ
చనుదేర, మునులను సరసను కూర్చుండ
బెట్టి గౌరిపతి ఇట్టులనియె:
"ఘనులార, ఓ మహామునులార మిము పిలి-
చిన కారణమును వచింతు, వినుడు:

ఏలూరి పురమున జాలరి కులమందు
శాపంబుచే గంగ జననమొందె;
కన్యకామణిని నే కల్యాణమగుటకు
హృదయములో నిశ్చయించుకొంటి;
పిల్లనిమ్మని నేనె వెళ్ళి నాయంతట
అడుగుట ఎంతయు అనుచితంబు;
శంఖుదేవయ కన్య జనకుండు, ఆతని
అడిగి ఒప్పించుడెట్లయిన మీరు;
కొంపల కొలదిగ వెండి బంగారముల్
కొదువ లేకుండ ఇచ్చెదననుండి;
దివ్యాంబరంబులు దివ్యభూషణముల-
ర్బుదముల కొలది ఇచ్చెదననుడి;
పట్టపు దేవి శ్రీపార్వతి అన, అధి-
కారమంతయును శ్రీగంగకనుడి;
వామభాగమున పార్వతి ఉన్నదన్నచో,
తల మీద గంగను దాల్తుననుడి;
పరికించి చూడ శుభస్య శీఘ్రమ్మను
పలుకును మీతోడ తెలుపనేల?
వేవే అరుంధతీదేవితో చని, ప్రధా-
నమును చేయుండు ఘనంబుగాను;
చక్రిమ్మ మదిలోన సందేహమెల్ల తీ-
రగ మీగలేదు వారాలకు తగు

నగిలంతిపురికి ముందుగ అరుంధతి చేత
పంపించుడీ ప్రధానంపు పనికి,".
అని శంకరుడు పల్క ఆనందమున మునుల్
శ్రీమహాదేవుని సెలవును కొని,
అపుడరుంధతితోడ అఖిలమునీశ్వరుల్
ఏలూరి పురమునకేగిరి వడి.

ఆ పట్టణము చొచ్చి ఆనందభరితులై
కన్నుల విందుగా కనుచు మునులు
జాలరి వీథిని చనుదెంచుచుండగా
ఆ వార్త శంఖుదేవయ్య ఎరిగి,
వారికెదురుగ వచ్చి, వందనంబులు చేసి,
వారిని గృహములోపలికి తెచ్చి,
మేలైనయట్టి రత్నాల గద్దెల పైని
కూర్చుండగా పెట్టి కుశలమడిగి,
అర్ఘ్యపాద్యాదుల అర్పణంబొనరించి
పదసేవ చేసి సద్భక్తితోడ:
"ఓ మహామునులార, ఓ తపోధనులార,
ఘనులార, మీ పాదకమలసేవ
ఏ పుణ్యమునను నాకీ వేళ లభియించె?
నాదు జన్మంబు ధన్యత్వమొందె,

నా కోరికలు పండె, నాదు భాగ్యము నిండె,
మీరు వచ్చుట మాకు మిగుల శుభము;
వివరంబుగా మీరు వేంచేయు హేతువు
వినుట'కై నా మది వేడ్కఁ జెందె,"
అని శంఖుదేవయ్య మునులతో పలుకంగ,
"జాలరికులవార్ధిచంద్ర, వినుము:
శుభ'మే తలంచి నిన్ జూడ వచ్చితి'మయ్య,
నీ నోటి మా'టల నిజము కాదు?
హరుడు నీ అల్లుడ'నయ్యెద'ననుచుండె:
వసుధ ఎంతటి పుణ్యవంతుడ'వౌకొ!
చెలువంబు గల'యట్టి శ్రీగంగ తండ్రి'వి,
మా శంభునకు నీవు మామ'వౌదు;
కన్యాప్రదానంబు కావింపు'మని నిన్ను
అడుగ వచ్చితిమి మే'మందరమును;
నీవు సుజ్ఞానివి, నీ'వెరుగని'దేది?
తగు చోటికీయగా తగదె సుతను?
భాగ్యశాలి, హరుండు, పరిపూర్ణకాముండు,
ఈ క్షోణి'కెల్లను రక్షకుండు,
అతని కొల్చిన వారి'కధికభాగ్యం'బిచ్చు,
ఈశ్వరునకు భాగ్య'మేమి కొదువ?
అతని సరి వేల్పు'లవనిలో లేరు, నిన్
పోలు వా'రుండగా బోరు భువిని,"

అని ఇట్లు మును'లెల్ల తనతోడ పలుకంగ
విని శంఖుదేవయ్య అనియె: "మౌని-
వరులార, మీ ఆజ్ఞ శిరసావహించి, నే
గరళకంఠునికి నా కన్య'నిత్తు;
తగిన చోటికి ఇయ్య తగు గదా బిడ్డను?
శ్రీమహేశ్వరున'కిచ్చెదను సుతను,"
అని శంఖుదేవయ్య మునులతో పలుకంగ
అధికబ్రహ్మానందు'లైరి వారు.
అంతకు పూర్వ'మే అట అరుంధతిదేవి
అంతఃపురంబులో'కరిగి, అచట
తూగు'టుయ్యాలలో ఊగు గంగను చూచి,
మొక్కిన బాలను ముద్దు'లాడి,
ఎదురుగా తొడలపై కూరుచుండగ బెట్టి,
బాల'నక్కున చేర్చి పలికె ఇట్లు:
"చక్రమ్మ కడుపున జన్మించినావె ఓ
ఘనజగదంబ, శ్రీగంగమాంబ?
నీలో మునింగిన నిర్మ్మల'మౌ గదా
పంచమహాపాపసంచయములు?
నిను కన్న వారికి నిఖిలపాపములు పో-
వగ, పుణ్యలోకముల్ వచ్చు గాదె?
శ్రీమహాదేవుని చిన్ని ముద్దుల భార్య
కా గలవే నీవు కన్న తల్లి,

ముద్దుల దేవి'వై మురిసెడి వేళను
　　నిను చూడ వత్తునే నెలత, నేను,"
అని అరుంధతి వచించిన, గంగమాంబిక
　　చిరునవ్వు మోమున చెన్ను మీర:
"ముల్లోకములకును ముత్తైదువవు నీవు,
　　సుఖమును శుభము నిన్ చూచి'నంత;
ధన్యుల'కే నీదు దర్శనం'బబ్బును,
　　దర్శనం'బిచ్చితి దయను కలిగి,"
అని ఇట్లు శ్రీగంగ తనతోడ పలుకంగ,
　　ఆనందమును పొంది మానిపత్ని
సరసను కూర్చున్న చక్రిమ్మతోడ ఇ'-
　　ట్లనె, "ముద్దుగుమ్మ, చక్రిమ్మ, వినుము:
నీ గర్భవాసాన శ్రీగంగ పుట్టెను,
　　నీ'వేమి మును నోచినావొ కాని!
నిటలాక్షుడు హరుండు నీ అల్లు'డౌటకు
　　ఉత్సాహమున కోరు'చున్న వాడు;
హరుని భాగ్యము చెప్ప అలవి కాదే తల్లి,
　　విశ్వేశ్వరుని ఇల్లు వెండి కొండ;
పాణిని గల విల్లు బంగారు కొండ; కు-
　　బేరుం'డె ఆతని ప్రియసఖుండు;
కోల్చెడి వార్కికి కొంగుబంగారంబు;
　　కామితంబుల'నిచ్చు కల్పతరువు;

నరకంఠునికి నీదు కన్యకామణి నిచ్చి
    సత్కీర్తి పొందుమా జగమునందు;
సఖియ, ఈవేళ వైశాఖశుద్ధద్వితీ-
    యా సోమవార మత్యంతశుభము;
ఇదె ప్రధానమునకు ఎంతయో మంచి ము-
    హూర్తము గనుక ఒనర్తుమమ్మ.
ఈశ్వరుండదె, ఇవే ప్రధానపు నగల్,
    కననమ్మ కన్నుల కరవు తీర:
చేర్చుక్క, పాపిటచేరులు, సూర్యచం-
    ద్రులు, ఇవి ఒక లక్ష విలువ చేయు;
వజ్రాల కమ్మ, రవ్వలతోడి నత్తు, క-
    మ్మలు, నాల్గు లక్షల విలువ చేయు;
శశిపువ్వు, రాగిడి, చామంతిపువ్వు, ఇ-
    వ్వి ఒక్కొక్కటే కోటి విలువ చేయు;
ముత్యాలహారముల్, మోరీల పేరులు,
    వేయి కోటుల దాక విలువ చేయు;
బంగారు జడయును, పసిడి ఒడ్డాణంబు,
    వీనికి ఇంతని విలువె లేదు;
పౌజులు, పోచీలు, బాజుబందులు, మురు-
    గులు, కంకణంబులు, గొలుసుల జత,
పాంజేబు, లందెలు, పావడాల్, కడియాలు,
    కాళ్ళమట్టెలును, పిల్లేళ్ళు, ఇంక

మిగిలిన చిన్నచిన్న నగలకు లెక్క'యే
లేదు, వానిని నీ'వె లెక్కపెట్టు;
ఏడు వారాలకు ఏడు రీతుల నగల్
కొని వచ్చినాము, కన్గొన గ'దమ్మ"
అని మాట చక్రిమ్మ' కందించె మునిపత్ని;
ఆ మాట కొనుచు చక్రిమ్మ అపుడు
మాట వే'రొక్కటి నోట పలుక లేక
తన బిడ్డ'నియ్యగా అనుమతించె:
సతిపతు'లిద్దరున్ శంభునకు కుమార్తె'-
నిచ్చెద'మనుచును ఇష్టపడిరి.
ఇష్టపడిన'యంత'నే అరుంధతి దేవి
పసుపు కుంకుమబొట్టు బాల'కుంచి,
తగు భూషణంబులు తరుణి మై'సమరించి,
ఎంచి మేల్చీర కట్టించి చూచి,
పెండ్లి తొందర'కేమి బెదర వ'ద్దనియును
అంతకు శివు భార'మనియు, మరియు
తప్ప'కుండగ రే'పె తరలి వచ్చెద'మని
చెప్పి, ఆమెయు మునుల్ సెలవుగొనిరి. 360

ఓ'ల పెండిలి'కయి జాలరు'లెల్లను
పురము శృంగారింప బూని'రపుడు:

వచ్చి కస్తూరియు పన్నీరు జవ్వాది
కలయంపు లెల్ల వీథులను చల్లి,
ముత్యాలతోడను ముగ్గులు పెట్టిరి;
పచ్చతోరణము లేర్పరిచి రంత;
కనకవస్త్రముల మేల్కట్లు ముత్యాల కు-
చ్చులతోడ కట్టిరి నలుదెసలను;
మంగళపదములు, మహితవాద్యంబులు,
పురము నల్దిక్కుల బోరుకొనియె;
ఎల్ల దిక్కులయందు ఏకస్వరంబుగా
శంఖధ్వనుల్ మ్రోగి సాగె వడిగ.

శంకరు కడ కేగి సకలమునీశులు
జరిగిన శుభవార్త ఎరుగ జేయ,
ఆనందమును పొంది అంబికానాథుండు
"తడవేల? పెండ్లికి తరలుద," మనె;
తరలుద మనుచును తలచిన క్షణములో
హరియును బ్రహ్మయు అమరవరులు
తమ విమానములపై తరలి వచ్చిరి వార-
లెల్ల సంతోషంబు లుల్లసిల్ల;
శ్రీదేవి భూదేవి శ్రీభారతీదేవి
కూడి వచ్చిరి వారితోడ; మరియు

గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యవి-
ద్యాధరపన్నగనాథులెల్ల
కనుల పండువగ శ్రీగంగామహేశవి-
వాహంబు చూడగా వచ్చి రపుడు;
వారి నందర కాంచి, వైభవంబున మించి
పశువాహనం బెక్కె భర్గుడపుడు
గరుడవాహనముపై కమలనాభుండును,
హంసవాహనముపై అబ్జభవుడు,
ఐరావతముమీద అమరనాథుండును,
నెమిలి వాహనముపై కొమరుసామి,
ఎలుక వాహనముపై ఆల గణనాథుండు,
చిలుక వాహనముపై చిత్తజుండు,
అంబికేశుని వెంట అతివైభవం బొప్ప
వెడలిరి మోములు వెలుగుచుండ;
"జయజయ," అనుచును సకలమునీశులు
నడిచిరి కాలకంధరుని ముందు.
అందరకున్ ముందు ఆనందభరితుడై
నాట్యము చేయుచు నడిచె భృంగి;
ఢంకానగారాలు ఢమఢమమని మ్రోగ,
తమ్మటనాదముల్ తరుచులయ్యె,
భేరీమృదంగముల్ భూరిధ్వను లొనర్చె,
కరము మ్రోసెను వీరకాహళులును,

పండితమాగధులు కైవారంబు చేసిరి,
        పంచనాదంబులు ప్రబలమయ్యె
పలు మహతాబులు పండు వెన్నెల కాయ,
        బహుదీపములు రాత్రి పగలు చేయ.
వారకాంతలు మేజువాణులనాడగా
        తరలి వచ్చెను వేడ్క పరమశివుడు,
రంభ ఆదిగ అప్సరసలు నాట్యము చేయ,
        తరలి వచ్చెను వేడ్క పరమశివుడు,
శృంగారకన్యలు మంగళంబులు పాడ,
        తరలి వచ్చెను వేడ్క పరమశివుడు.
శ్రీపతి భారతి సేసలు చల్లగా,
        తరలి వచ్చెను వేడ్క పరమశివుడు.
నందీశుపై ఎక్కి అందరు ముదమంద
        తరలి వచ్చెను వేడ్క పరమశివుడు,
ఆకాశమున కంటునట్లు తారాజువ్వ-
        లెగసి చుక్కలలోన ఇమిడి పోయె.
వెండి పువ్వుల చెట్లు విస్తరిల్లినయట్లు
        సొగసుగా కాలెను చుంచుబుడ్లు;
భువిలోని రత్నముల్ దివికెగసినయట్లు
        వెన్నముద్దలు లేచె వన్నెలలర;
లంకాపురులు కొన్ని వంకల; కొన్ని వం-
        కలను బాణాసంచు కాల సాగె;

ఇట్లు సంభ్రమముతో ఎల్ల వేడుకలతో
ఏలూరి పురమున కేగె శివుడు.
ఎదురు మేళములతో ఏకసంభ్రమముతో
ఆయొద్ద శంభుదేవయ్య వచ్చె;
పట్టణస్త్రీలెల్ల పార్వతీశ్వరునకు
నివ్వాళులను పట్టి నిలిచిరపుడు;
జాలరి స్త్రీలెల్ల శంభునికెదురుగా
నివ్వాళులనుపట్టి నిలిచిరపుడు;
నివ్వాళులను పట్టు నీలవేణుల తబు-
కులనిండ పోసె కాసులను శివుడు;
బంగారు తబుకుల బోగైన వస్తువుల్
కంత తెచ్చిరి దేవకాంతలపుడు;
తీరైన పెండ్లి పందిలిలోన నిలిచిరి
కంత తెచ్చినయట్టి కాంతలెల్ల.
చిరునవ్వు మోముతో శ్రీమహాదేవుండు
వృషభవాహనము ఆ వేళ దిగెను;
హరియును బ్రహ్మయు ఆదిగా గలవారు
తమ వాహనంబులందరును దిగిరి.
పసిడి పావలతోడ పార్వతీనాథుండు
తామరసాక్షు కైదండ కొనుచు,
వెనుకను పరమేష్ఠి చనుదేరగా నేగి
ప్రీతితోడను పెండ్లిపీట నెక్కె.

నవరత్నఖచితమైనట్టి బంగరు పెండ్లి
పీటపై కూర్చుండె ప్రీతి వారుడు.
దేవకాంతలు వచ్చి దేవదేవునకును
నలుగులు పెట్టిరి ఎలమితోడ;
పసిడి కుండలతోడ పన్నీరు కొని వచ్చి
జలకమాడించిరి శంకరునకు;
ధవళవస్త్రములతో తడి ఒత్తి, గంధము
పూసి, పెట్టిరి పెండ్లి బొట్టు నుదుట.
శృంగారవతియైన గంగాభవానికి
జలజలోచన ఓర్తు నలుగు పెట్టె;
కనకఘటంబుతో కలకంఠి ఒక్కర్తు
జలముల కొని వచ్చి జలకమార్చె;
ధవళవస్త్రంబుచే తడియార్చి, పన్నీరు
జల్లి గంధమలందె సకియ ఓర్తు;
కురులు నున్నగ దువ్వి కొండె సిగను చుట్టి
విరులను దానిపై దురిమె నొకతె;
పసిడి వన్నె మెరుంగు పట్టు వస్త్రంబును
కాంతామణి ఒకర్తు కట్టబెట్టె;
నవరత్నమయభూషణంబుల తొడగించి
తిలకంబు నుదుటను దిద్దె నొకతె;
అట్లు శృంగారించి ఆ ఇంతిచే గౌరి-
కిని భక్తితోడ మొక్కించిరపుడు.

మ్రొక్కించి పిమ్మట ముద్దుబాలిక'నరుం-
ధతి'కప్పగించిరి తరుణు'లెల్ల.
ముద్దియన్ గొనిపోయి ముమ్మారు పెండ్లికి-
టకు ప్రదక్షిణము'నా సకియచేత
చేయించి మునిపత్ని శివు వామపార్శ్వంబు
తట్టున కూర్చుండ బెట్టె చెలిని.
బ్రహ్మదేవు'డె పెండ్లి పౌరోహితుం'డౌచు
గణపతి పూజ యుక్తముగ గాఁగ,
శ్రీమహేశ్వరునకు శ్రీగంగమాంబకు
కంకణంబులు కట్టె కరములందు.
శంభుదేవయ్యయు చక్రమ్మయును కూడి
మెరుగు బంగారు పళ్లెరమునందు
పన్నీటితో పాదపద్మముల్ కడిగి, శం-
భునకు కన్యాధార పోసి'రపుడు;
కలితసాలంకృతకన్యాప్రదానంబు
చేసిరి ముదముతో శ్రీశివునకు.
చిరునవ్వు నవ్వుచు శ్రీమహాదేవుండు
పొలతి'కంఠతట తాళిబొట్టు కట్టె;
చారుమంగళసూత్రధారణం'బొనరించె
శ్రీగంగ మెడ చంద్రశేఖరుండు;
అఖిలబంధంబులు అడగించు గంగను
బంధించె పోగుచే పార్వతీపతి;

పదునాల్గు లోకముల్ పట్ట'కుండెడు గంగ
కడ'కొక పోగుచే కట్టు పడియె.
తరువాత ఆ వధూవరులు కూర్చుండంగ,
వేడుకతోడను చేడె'ల్ల
తళుకుల ముత్యాల తలబ్రాలు కొనివచ్చి
ఇరువురిచేత పోయించి'రపుడు;
హరునిపై గంగయు అతివపైని హరుండు
మచ్చరించుచు చల్లి'రెచ్చుగాను.
మదనుండు గుప్పిన మల్లి మొగ్గల లాగు
తలబ్రాలు క్రమ్మెను తనువులందు;
"మనచేయిమీ'దాయె," "మనచేయిమీ'దాయె-"
యని ఇరు వంక వారును మురిసిరి.
తరువాత ఆ వధూవరులు కట్టిన పుట్ట-
ములకు వేసెను బ్రహ్మముళ్ళు బ్రహ్మ.
ఆ వధూవరులకు అగ్రభాగంబున
ఒనరించెను విధాత హోమ'మపుడు,
బ్రాహ్మణులు మంచి పట్టు వస్త్రము తెచ్చి
తెర వేసి'రా వధూవరుల నడుమ.
గంగచే అందెలు గల్లన సప్త పా-
దములు త్రొక్కించిరి రమణు'లంత.
దంపతులకును యుక్త ప్రకారమున క-
న్పరిచి'రరుంధతీభామ'నపుడు.

ముంగముంతో ఫలదానములను చేసిరి ఇరు
తెగ వారు ఒక్కొటే తీరుగాగ.
ఆనందయుతచిత్తుడై శంఖుదేవయ్య
చదివించె కట్నముల్ శంకరునకు:
పది వేల గజములు పది కోట్ల గుర్రము-
లరణంబు చదివించె అల్లునికిని;
కోటి గోవులు కోట్ల కొలది దాసినులను
అరణంబు చదివించె అల్లునికిని;
తన ఇంట గల యట్టి ఘనరత్నముల నెల్ల
అరణంబు చదివించె అల్లునికిని.
అప్పుడు పేరంటాండ్రు దంపతులమీద
పాడ సాగిరి పెండ్లి పాటలిట్లు:
"శ్రీరమావిష్ణుల చెలువున ఈ దంప-
తులు శుభములను పొందుదురు గాక!
తావియు పూవు చందంబున ఈ దంప-
తులు కూడి సుఖములందుదురు గాక!
వెన్నెల జాబిల్లి విధమున ఈ దంప-
తులు కూడి మోదమొందుదురు గాక!
సర్వమంగళములు సతతంబు మా గంగ
పార్వతీసతి వలె పడయు గాక!"
అనుచును నివాళులను పట్టి నివాళి
పాటలు పాడిరి పడతులెల్ల:

"శ్రీమహాదేవ, శ్రీశివ, నీకు నివ్వాళి;
శైలజానాథ, నివ్వాళి నీకు;
కరుణాలవాల, శంకర, నీకు నివ్వాళి;
వాసవవినుత, నివ్వాళి నీకు,"
అనుచును నివ్వాళులును పట్టె; అపుడు మం-
గళములు పాడి రంగనలు కూడి:
'మంగళం'బర్కకోటిమార్తాండసమునకు,
మంగళం'బంగజభంగునకును,
మంగళం'బఖిలసన్మునివంద్యునకు, మం-
గళము సువర్ణాద్రికార్ముకునకు,
జయమంగళము, నిత్యజయమంగళం'బని
అంగనల్ పాడిరి మంగళములు.
ఈ క్రమంబుగను యథాక్రమంబుగ పెండ్లి-
యెల్ల కాగా, నాగవల్లి నాడు
శంఖుదేవయ్యయు చక్రమ్మయును బిడ్డ-
నప్పగింతలు పెట్టు నవసరమున,
కన్నీరు పెట్టుచు కన్నె హస్తంబును
హరు చేతిలో పెట్టి అనిరి ఇట్లు:
"శ్రీమహాదేవ, రాజీవాక్షసన్నుతా,
లోకనాయక, సర్వలోకరక్ష,
మా తండ్రి, పరమేశ, మమ్ము రక్షింప మా-
కల్లుడ వైతి వనాదరమున;

తొల్లింటి పుణ్యంబు'లెల్లను పండెను,
నిండెను భాగ్యంబు నేఁడు మాకు:
కోటి నోములు నోచి కోటి వేల్పుల కొల్చి
కంటి మిా ఒక్క వాల్గంటి మేము;
అప్పగించితిమి మా అమ్మ నీ సొమ్ముగా,
చేపట్టి రక్షించు శ్రీమహేశ:
పసిబాల ఈ గోల పను'లేమి ఎరుగదు,
దినదినంబును నీవు దిద్దుకొనుము.
ఇన్నాళ్లు'న్నది కన్నవారల చాటు,
నెలతకు సకలంబు నీ'వె ఇంక;
అత్తవా'రింట భాగ్యం'బెంత కల్గిన,
పుట్టింటిపై ఆశ పోదు సతికి,
గగన'మంతపొడుగు కాపురం'బున్నను
పుట్టింటిపై ఆశ పోదు సతికి,
మగనిపై తన'కెంత మమకార'మున్నను
పుట్టింటిపై ఆశ పోదు సతికి;
మరపున'నైనను మా'టాడ నేరని
కన్నె, నీ'వేలాగు గడుపుకొనెదో?
బాలికన్ కృపతోడ పాలించి బ్రోవుము,
బాల నీసొమ్ము నీ'వేలుకొమ్ము;
పరమేశ, నిజముగా పగవారి'కైనను
ఆడు సంతానంబు కూడ'దయ్యా;

మా బిడ్డ అని చెప్పగా బూనితి'మె కాని
    అంత భారము నీ'దె అగు సు'మయ్యా;
తప్పు వచ్చిన వేళ తాల్మితో రక్షించు,
    కోపగింపకు వట్టి గోల ఈమె:
తప్పును చేసిన ఒప్పుగా భావించి
    ప్రేమించుమీ వట్టి బేల ఈమె;
ప్రాణనాథుడు సతి పక్షమై ఉన్నచో
    మిన్ను విరిగినను మీద పడదు;
దాత'వైనను నీ'వె, దైవంబువును నీ'వె,
    గురుడ'వైనను నీ'వె, వరుడ'వీ'వె,
చాల చెప్పగ'నేల? సరిగ గౌరమ్మతో
    ఈ బాలికను కూడ ఏలుకొమ్ము,"
అని అప్పగించిన అత్తమామల చూచి
    అంబికానాయకుం'డనియె'నిట్లు:
"ఇంత మీరలు చెప్ప'నేల? నే'నెరుగనా?
    నెలత నా ప్రాణము నిశ్చయముగ;
జీవంబు'నెవ్వరు చెడ జూచుకొందురు?
    బ్రదు'కాశ లే'కున్న ప్రజలు గలరె?
కులవధూమణులతో కలహింప రా'దన్న
    శాస్త్రపద్ధతి నేను చదువ లేదె?
సకియ శ్రీగంగను జడలలో పెట్టెద,
    గాలి పారక'యుండ ఏలుకొందు,"

అని శంకరుఁడు పల్క అప్పుఁడా దంపతుల్
విని తమ కూఁతుతో అనిరి ఇట్లు:
"మాగర్భరత్నమా, మము కన్న తల్లి, జ-
గన్మాతవై, నీవెఱుంగనిది కలదె?
నీ బుద్ధికిని మెచ్చి, నీ భర్త ఆయెను
పార్వతీనాథుండు పరమశివుఁడు;
పలుమాటలింకేల? భాగ్యశాలిని వీవు,
పరమహాదేవుని భార్యవైతి-;
వయినను తలిదండ్రులందఱ వలె బుద్ధు-
లను చెప్పుచున్నాము విన గదమ్మ:
అత్తవారింటి ప్రక్కగు వారినెల్లను
దైవభావంబుగా తలఁపవమ్మ;
ప్రాణనాథుఁడు కోపపడి తిట్టినను గాని
మది అరమర లేక మసలుమమ్మ;
తల్లిదండ్రులు అన్నదమ్ములకంటెను
అతివకు అధిపుఁడే అధికుఁడు సుమీ;
ఎందరు బంధువులెందరు చెలులున్న
పతి సాటి కాబోరు భామినులకు;
వేల కొలందిగా విత్తమున్నను పతి
వంటి భాగ్యము లేదు వనితలకును;
కోటి నోములు నోచుకొన్నను పతిభక్తి-
తో సాటి కాబోవు తొయ్యలులకు;

అత్తవారెవరైన ఆగ్రహించిన వేళ
మారు మాటాడకే మాకు తల్లి;
అత్తవారలు తిట్టినట్టి మాటలను దీ-
వింపులు గాగ భావింపుమమ్మ;
హృదయనాథుడు చనువెంత ఇచ్చిన, నీవు
మురియుంగ బోకుమీ ముద్దు తల్లి;
బీదసాదల పట్ల ప్రియముగా మెలగుము;
కడు విశాలపు కీర్తి కనుము తల్లి;
సిరులు కల్గిన కొద్ది మురియక, వినయంబు-
తో నడుచుట తగు తొయ్యలులకు;
పతిభక్తి సౌఖ్యంబు పతిభక్తి భాగ్యంబు
పతిభక్తి పుణ్యంబు పడతులకును
పతిభక్తితో సాటి వ్రతమిల లేదు, ప-
తివ్రతవగుచు వర్తింపుమమ్మ;
పతిభక్తి కలిగి సమ్మతితోడ నీవున్న,
ఎందరేరాండ్లున్న నేమి తల్లి?
పెద్దది గారవ్వ, చిన్న దానవు నీవు,
మది అసూయను లేక మసలుమమ్మ;
తల్లిదండ్రులకన్నదమ్ములకాడికల్
కలుగకుండగ నీవు మెలగు తల్లి;
పుట్టినయింటికిన్ మెట్టినయింటికిన్
వన్నె తేవలె నీ ప్రవర్తనమ్మ;

అన వలసిన నీతు'లంటి'మిం'తే కాని,
నీ' వెరుంగని'యట్టి నీతి కలదె?
నీవు మా'యింట జన్మించుటచే మా కు-
లంబు వంశము పావనంబు'లయ్యె;
నీవు చింతిల'నేల? నిమిష'మైనను గాని
నిను బాసి ఉందుమే నెలత, మేము?
దినదినంబును నిను కనుగొన వత్తుము;
చేరు'వె కాదె శ్రీశివుని పురము?
నీ భాగ్యగరిమ వర్ణింపగా తర'మా'నె?
రజితాద్రిపురికిని రాణి'వైతి',"
వని బాల'నోదార్చి అక్కున చేర్చి పు-
త్రిల కను'మని దీవనలు'నొసగి,
అందలం'బెక్కించి అధిక'మౌ సారెతో
పరమేశు వెంటను పంపి'రపుడు. 510

అపుడు శంకరుడు మాయావినోదుం'డౌచు
గౌరిమహాదేవి కాన'కుండ
సారెగా పంపిన సకల పదార్థముల్
కైలాసమున ఒక మూలదాచి,
క్రొత్త భార్యగ తెచ్చుకొన్న గంగను కన-
బడ'కుండగా తన జడల దాచి,

మాయావినోదు'డై మదనహరుం'డిట్లు
రయమున చనుదెంచె రజతగిరికి.

అంతకు పూర్వ'మే అరుదెంచి నారదుం'-
డుమ చెవిలోపల ఊదె'నిట్లు:
"శాంకరీ, శాంభవీ, సకలజగన్మాత,
వింటివే? నే'డొక వింత పుట్టె:
నీలకంఠుం'డొక్క జాలరి కన్నెను
పరిణయం'బయ్యె; వే పల్క'లేల?
ముసలి కాలంబున ముచ్చటల్ పుట్టెనో!
కామాతురుం'డయ్యె కామహరుడు!
ఎరుగని వాని వైఖరి సన్నసన్నగా
వేంచేసె'నదె చూడు విశ్వభర్త;
కన్న చందంబు నిక్కముగ నే చెప్పితి,
మటుమాయవాడు సుమ్మా శివుండు,"
అని చెప్పి నారదుం'డటు బాసి పోవగా
చెక్కిట శ్రీగౌరి చేయి చేర్చి,
"ఇంతకు వచ్చెనా? ఈశ్వరా," అనుచును
తల్లడంబును పొంది, తన చెలులకు
"దేవిడీ తలుపులు తియ్య వ',"ద్దని చెప్పి,
తాళముల్ వేసెను తలుపులకును;

తలుపులు ముద్రలు తాళంబులను వేసి,
గౌరమ్మ ఒక చోట కూరుచుండె.
అంతలో శంభుండు అతివేగమున వచ్చి,
"తలుపు తీయవె," అంచు పిలిచినంత
శివుని మాటాలించి శ్రీగౌరిదేవమ్మ
అధికకోపంబుతో అనియెనిట్లు:
"నన్నరగడియయైనను బాయనంచును
పలుకుచుండుదువు గదా పరమపురుష?
ఎన్నడు లేనిది ఎచటికి నను విడ-
నాడి పోయితివయ్య ప్రాణనాథ?
మాయ ఏటికి? నిజమే ఏల తెలుపవు?
వింతగా ఉండె నీ విధము చూడ;
పాము జాడలు పాము పట్టలేదే?నీదు
జాడలు నే పట్టజాలనొకో?
ఏలూరి పురములో జాలరి కన్నెకు
తాళి కట్టితివ? లేదా? వచింపు;
తెలియ జెప్పక తల్పు తీయుట జరుగదు,
బొంకకుండంగ చెప్పుము మహేశ,"
అని గౌరి పలుకంగ అంబికానాథుండు,
"ఈమెకేరీతిగా ఎరుగనయ్యె?
ఏమి సాధనము? ఇంకెట్లు బొంకుదు," నని
అధికవిభ్రాంతుడై అనియెనిట్లు:

"ఎంత మాటాడితివే? అదరా! గౌరి, నే-
నే పాపకర్మంబు నెరుగను సుమి;
ముది కాలమున నాకు మోహంబు కలుగునా?
దబ్బగలాడుట తగునె నీకు?
ఏల నాకిక పెండ్లి? ఏ కన్య యైన నా
ముదిమిని కని ఎట్లు మోహపడును?
అన్యాయమగు మాటలన దగునటె గౌరి?
ఎవరు చెప్పిరి నీకు ఇట్టి బుద్ధి?"
"ఎవరు చెప్పిన నేమి? ఈశ్వరా, జాలరి
కన్నెను తెచ్చుట కల్ల? నిజమ?
అయినట్టి పని కిక అనుమాన మేటికి?
మరుగు బెట్టగ బోక ఎరుగ చెప్పు;
మాయ లేటికి? నీకు మర్మ మేటికి? జరి-
గిన దంతయును ఎరిగింపు స్వామి."
"గౌరి, నీ కిక నమ్మకమ్ము కల్గింప శ-
క్యమ్మె? బాస ఒనర్తు నమ్మ గదవె."
"బాస చేయుట ఎంత పని నీకు? శంభుడా,
అధికమాయల వాడవయ్య, నీవు."
"కాలసర్పము కేల గైకొని పలికెద,
నా మాట నిజముగా నమ్మ గదవె."
"కాలసర్పంబు నీ కరకంకణం బయ్యె,
అది ఎంత పని నీకు మదనదమన?"

"విషము పాన'మొనర్తు, వేయు'నిం'కేటికి?
నా మాట ఇక'నైన నమ్మ గదవె."
"కాలకూటము నీవు కబళించి ఉన్నావు,
విష'మన్న జడిసెదవే మహేశ?"
"ఆ'శాంర నిప్పుల అరచేత పట్టెద,
నా మాట ఇ'కనైన నమ్మ గదవె."
"తేజంబు గల అగ్ని దేవుడు నీ కన్ను,
నిప్పులు లక్ష్యమా నీకు స్వామి?"
"బెబ్బులి కంఠంబు బిగబట్టి నిలిచెద,
నా మాట ఇక'నైన నమ్మ గదవె."
"పులి చంపి తోలు వీపున దాల్చినాడవు,
నీ'కెంత పని అది నీలకంఠ?
"తల నిల్వు నీటిలోపల చొచ్చి నిలిచెద,
నా మాట ఇక'నైన నమ్మ'గదవె."
"గంగను తలమీంద కాబోలు దాల్చితి,
తల ముస్క-'లయ్యెనో వలపు నీకు?"
"బాస'లన్నియు నీకు పాటి కా'కున్న నే-
నెట్లు నమ్మింతునే ఇంక నిన్ను?"
"కల బాస'లే నీవు తెలియ జెప్పితి'వయ్య,
ని'న్నెట్లు నమ్మగా నేర్తు స్వామి?
శిరమున జాజులు దురిమె'నెవ్వతె నీకు?
నిజము చెప్ప గ'దయ్య నీలకంఠ."

''అవి మింటిపై ఒక్క అమరుండు కొనిపోవ,
చే జారి పడెను నా శిరముమీద;
అతడు 'శివార్పణ'మని చన, ఇట్లు నా
తలమీద జాజులు నిలిచె గౌరి.''
''సరిగ బొంకితి'వయ్య సాంబశివా, మరి
ఇం'కొక్క'టడిగెద, బొంకు మరల:
పసుపును కుంకుమ పరిమళద్రవ్యముల్
నీ మేని'కెట్టు'లంటెను వచింపు.''
''పసుపును కుంకుమ పరిమళద్రవ్యంబు'-
లర్పితం'బయ్యె గణాధిపతికి;
అతడు నాపై పొర'లాడగా అవి ఎల్ల
నా మేని'కంటెను, నమ్ము గౌరి.''
''శాబాసు! శాబాసు! సరిగ బొంకితి'వయ్య,
మరి ఒక్క'టడిగెద, మరల బొంకు:
కంఠంబునను నీకు కస్తూరి రేఖలు
కలిగి'యుండుట'కేమి కారణంబు?''
''కాలకూటము మ్రింగి గళములో'నే నేను
నిలిపితి'నని నీకు తెలియును గద?
గరళ రేఖలు చూచి కస్తూరి రేఖలు-
గా భ్రమసితి'వేమొ గౌరి, నీవు?''
''సరిగ బొంకితివి, మెచ్చగ వచ్చు; మరి ఒక్క'-
టడిగెద, బొంక గ'దయ్య మరల:

జడలెల్ల పూరిగా తడిసి ఉన్నవి గదా?
ఏమందువయ్యా ఓ వాసుదేవ?"
"అర్చకుల్ భక్తితో అభిషేకమొనరింతురు
కొబ్బరి నీళ్ళు నా గుడులలోన;
జడలలో ఆ నీళ్ళు పడి నిల్చి ఉంటచే
తడిసినట్టులు కనంబడెను గౌరి."
"ఏ పాపమెరుగవు పాపము! ఇంక ఒ-
క్కటి అడిగెదను బొంక గదవయ్యా:
పరిమళద్రవ్యముల్ పడ రాసికొన్న, ఈ
నీచు కంపేటికి నీదు మేన?"
"నా చెలికాడైన నలిననాభుండు మ-
త్స్యావతారం బెత్తినట్టి వేళ
అతనితో కూడి నే నబ్ధిలో తిరుగగా
పొలుసు వాసన మేన నిలిచె గౌరి;
నిన్ను మీరిన పనుల్ నేను చేయుదునటే?
నా మాట నిజముగా నమ్మ గదవె.
కొండెముల్ నమ్మకే, గుణశాలినివి; నాదు
గుణమైన ఎరుగవే కొమ్మ, నీవు?"
"నిజము సర్వేశ్వరా, నీ మాట సత్యంబు;
ఆడి తప్పని వాడవయ్యా నీవు;
నీ చెలికాడైన నీరజనాభుండు
మోహినీరూపము పూనినపుడు

నీ'వప్పుడా మోహినిని మోహమున వెంట-
బడిన మాట పరాకు పడితి'వేమొ?
నీ గుణం'బెరుగనా? నిన్ను నే'నెరుగనా?
నాకడనా మాయ నడత'లెల్ల?
ఇతరకాంతలు నీకు హితము కా'కున్నచో,
కాలభైరవు'నెట్లు కంటి'వయ్యా?
పరవధూమణుల ఒప్పని వాడ'వన్నచో,
హనుమంతు'డెటు నీకు జనన'మొందె?
అన్యకామినుల నీ'వాసింపకున్న, అ-
శ్వత్థామ ఎటు నీకు జన్మ'మొందె?
మనసు మెత్తని వాడ'వని ఎరుంగుదును; ఏ
వనిత కోరినను లే'దనగ లేవు;
కల్ల మాటలు మాను గరళకంఠా, 'ఇంక
గోచరం'బయ్యె నీ గుణము'లెల్ల;
అఖిలలోకేశుడ'వై ఉండి నీ'విట్లు
కల్లబాసలు చేయ జెల్లు'నయ్యా?"
అని ఇట్లు చాల ఖండనముగా పలికిన
గౌరితో ఇ'ట్లనె కామహరుడు:
"ఇల్లాలి దయ తప్ప, ఎంత వానికి'నైన
నిలువ శక్యము కాదు నిజము గౌరి;
దండంబు దండంబు తప్పు నా'యెడ వచ్చె,
'దయ జూడు దయ జూడు దాసు నను', :

దాసుని తప్పులు దండంబుతో సరి
గనుక, తల్పును తీయ గదవె గౌరి,”
అనుచు చేతులు మోడ్చు అంబికానాథుని
కనుగొని శ్రీగౌరి కనికరించి,
తత్తరపాటుతో తలుపును తీసి, సా-
ష్టాంగంబుగా మ్రొక్కి అంతిపురికి
తోడ్కొంచు చని, హంసతూలికాశయ్య పై-
భుండును తాను కూర్చుండె'నంత.
సవతిని కన'నెంచి జడలలోపలనుంచి
గంగ ఒ'కించుక తొంగి చూచె;
తొంగి చూచుచు'న్నన గంగను పొడగాంచి
అతికోపమున గౌరి అని'యె'నిట్లు:
“ఎవతవే శివు శిర'మెక్కి కూర్చుంటివి
గయ్యాళిసవతి, కన్గాన లేక?”
“కన్న కానని'యుంత గయ్యాళి నే గాను;
గౌరవ్వ, ఆకాశగంగ'నాదు.”
“గంగ'నై'తే నీవు గగనము'నుండక
మగని శిరం'బెక్కె తగునె గంగ?”
“మగని మాటకు నేను మా'రాడ లేక గౌ-
రవ్వ, ఉంటి'నతండు చెప్పిన'ట్లు”
“అ'ట్లైన మారు మా'టాడక ఒక మూల
ఒదిగి నీ'వుండగా గదవె గంగ.”

“ధవునికి మనమీాద దయ’యున్న గౌరప్ప,
ఒదిగి ఉన్నను ఏమి కొదువ మాకు?”
“గతి మాలి నా ఇంట కడ చేయ’టే కాక
మత్సరింతువె మతి మాలి గంగ?”
“మును పుట్టు చెవులకంటెను వెనక పుట్టు కొ-
మ్ము’లె వాడి గౌరప్ప, తెలిసికొనవె.”
“అచ్చికల్ బుచ్చికల్ మచ్చికల్ చూపుచు
తగులుకొంటివె నాదు మగని గంగ?”
“వచ్చితి, ఇక నీవు వ’ద్దన్న మాననను;
గౌరప్ప, ఏటికి కచ్చుకొనగ?”
“హీనజాతివి; నీకు ఇంతటి గర్వమా
గతి మాలి వచ్చిన గడుసు గంగ?”
“కర’కైన రాళ్ళ బంగారంబు పుట్టు; గౌ-
రప్ప, పుట్టుక ఎచ్చ’టైన’నేమి?”
“ఉన్నతగోత్రసముద్భవన్ నేను; ఏ
గతిని నన్ పోలగా గలవు గంగ?”
“పాలసంద్రంబులోపల పుట్టె విషము; గౌ-
రప్ప, పుట్టుక ఎచ్చ’టైన’నేమి?”
“వలపు మందులు పెట్టి వలపించుకొంటివా
గడప దాటని శివున్ గడుసు గంగ?”
“వలపు మందులు చాల కలుగు కొండను; నీవు
గౌరప్ప, ఘటికివి గావె అందు?”

"నా‘రెత్త’కుండ తన్నులు నిన్నుతన్నుచో,
ఈ మూల నీకు ది’క్కె’వరె గంగ?"
"దిక్కు’లన్నిటికిని ది’క్కైన దొర’యె గౌ’-
రప్ప, నిక్కముగ ది’క్కగును నాకు."
"అహా! ఎంత చనువరి’వైతివే? హరుని ముం-
దర పల్కగా గల్గినావు గంగ."
"జడల న’న్నుంచె పార్శ్వమున ని’న్నుంచెను;
గౌరప్ప, చనువరిన్ గానె నేను?"
"శిరసును దిగ’వేమి సిగ్గు మాలిన గంగ,
ఇంతటి సామంతి’మెవ’రొసగిరి?"
"నను బాయ’ననుచు బాసను చేసి తెచ్చె, ఓ
గౌరప్ప, శివు’డధికార’మిచ్చె."
"శిర’సెక్కి ఉంటకు సి’గ్గైన లే’దటే?
నీతియు తెలియదే నీకు గంగ?"
"ఆకాశగంగ నే’నని వ్యోమకేశుండు
తల దాల్చె; గౌరప్ప, త’ప్పే’లాను?"
"జాతి చూడగ కల్లు జాలరి దానవు;
ఎట్లు నిన్ వలచెనే ఈశ్వరుండు?"
"కల్లు జాలరినొ, నే కొండ దాననొ, నన్ను
గౌరప్ప, శంభుండు కోరి తెచ్చె."
"సొంగసు చూడగ పట్టి సుళ్ళదానవు నీవు;
ఎట్లు నిన్ వలచెనే ఈశ్వరుండు?"

"సుళ్ళ దాననొ లేక నల్ల దాననొ, నన్ను
గౌరప్ప, శంభుండు కోరి తెచ్చె."
"నడనడి చూడగా వడి గలదానవు;
ఎట్లు నిన్ వలచెనే ఈశ్వరుండు?"
"వడిదాననో, బండవంటిదాననొ, నన్ను
గౌరప్ప, శంభుండు కోరి తెచ్చె."
"పతి సముద్రుడు గదా? అతనిని విడిచి, ఈ
మగనిని మరుగుట తగునె గంగ?"
"తండ్రి జంపిన వాని తగులుకొనుటకంటె
గౌరప్ప, పాపమే మారు మనువు?"
"చెల్లబో! గంగ, భీతిల్లగా బోక మా-
టకు మాట పల్క దొడంగినావె?"
"నీవు మాటాడగా నేను మారాడక-
యుండుట గౌరప్ప, ఉచితమానె?"
"ఉచితంబొ, కాదొ, నీ పూరకుండని యెడ,
తరిగుంతు నీ జిహ్వ తప్పకుండ"
"నీ తరిగిన కూర నా తరిగిన కూర
గౌరప్ప, వడ్డించు కంచమందు".
"చెవులు గీమనునట్లు చెంపకాయను కొట్ట
గలను సుమ్మీ, ఓసి గడుసు గంగ."
"నీవు కొట్టిన కాయ నేను కొట్టిన కాయ
గౌరప్ప, నింతుమా గంపయందు?"

“అతిచమత్కారంబు’లాడ’కుండంగ పం-
డ్లూడగా కొట్టుదు’నోసి గంగ.”
“నీవు కొట్టిన పండ్లు నేను కొట్టిన పండ్లు
పంతుమా గౌరప్ప, బాలురకును?”
“ఇప్పు’డాడిన మాట ఇక ఆడ’కుండంగ
పడ ద్రోసి కుమ్మెద గదుసు గంగ.”
“నీవు కుమ్మిన మన్ను నేను కుమ్మిన మన్ను
గౌరప్ప, గోడను కట్టవచ్చు.”
“గోడ మూలను పెట్టి కొప్పును పట్టి వం-
చుచు నిన్ను దంచెద సుమ్ము గంగ.”
“నీవు దంచిన వెన్క నే’నూరకోరాదు;
తగు రీతి గౌరప్ప, దంతు నేను.”
“దంతువా? కన్నులు తలపైకి వచ్చెనా?
నో’రెత్త’కుండ తన్నుదును నిన్ను; (64)
చూడవే సవతిరో, చూడవే,” అని పల్కి-
కను’లెర్ర చేసి ఆగ్రహముతోడ
లేవగా బోన, జటావాటిలో గంగ
ఆశ్చర్యకరముగా అణగి పోయె.
తలలోన శ్రీగంగ దాగిపోవుట చూచి,
“దానితో మన’కేమి తర్క’?” మనుచు,
హరు మోము వీక్షించి అంబిక ఇట్లనె:
“వెల్లబో మీ ప్రజ్ఞ శ్రీమహేశ!

ఎవతెను తే లేదు; ఏ పాప మెరుగ న-
        టంచు నాతో ఎట్టు లంటి వయ్యా?
పలు విధంబులుగాగ బాస చేసితివి; ఏ-
        దీ నీదు నియమ? మేదీ నిజంబు?
నీ ఖ్యాతి ఎటు కేగె? నీ నీతి ఎచటికి
        పోయె? నీజ్ఞాన మే మూల నణగె?
జాలరి కన్యక నేలాగు తెచ్చితి?
        కులహీన నేలాగు వలచినావు?
సవతి పోరును పెట్టి చెవి నాలకించితి
        కాదన కుండ వేడ్కగను నీవు;
తరుణి పెట్టిన మందు తల కెక్కెనో నీకు?
        తల కెక్కెనో దాని వలపు నీకు?
నీచు కాంతను తెచ్చి నీ జడలందుంచి
        నను రవ్వ బెట్టుట న్యాయ మయ్యా?
అఖిలలోకములకు ఆదికారణుడవు,
        పరమాత్ముడవు, సర్వపాలకుడవు:
ఇంత వాడవు నీవె ఇట్లు చేసినను, నే-
        నేమి చేయుదును? నిన్నేమి అందు?
వెలుగ చేనును మేసి వేసిన, తండ్రియే
        కొడుకు కూతుల అమ్ముకొన తలచిన,
అన్నమే విషమైన, అవనీతలేశుడే
        న్యాయభంగంబుగా నడుచుచున్న,

ప్రాణేశ్వరుం'డె తన భార్య'నెల్లక'యున్న,
వ'ద్దంచు చెప్పెడు వార'లెవరు?
నన్ను కన్నడ చేసి నామీద ఒక్కతెన్;
తెచ్చుట న్యాయమా దేవదేవ?
కాల'మెల్లను తీరగా ముది కాలాన
తెచ్చితి మచ్చెంపు మచ్చెకంటి!
తెచ్చిన వెనక సందియ'మొందగా'నేల?
దాపరిక'మేల? దబ్బ'రేల?
అదియును నీవు ఇష్టాలాపములతోడ
ఉల్లాసమున కూడి ఉండ వచ్చు;
చాలు నీతోడి సంసారంబు, చాలును,
పడుచు కాంతను కూడి ప్రబలు'మయ్యా;
నడుమను నే'నున్న'యెడలను నీ'కడ్డు,
సెల'విమ్ము, పు'ట్టిల్లు చేర బోదు;
నీ పదధ్యానంబు నే మరువక ఉందు,
సెల'విమ్ము, పు'ట్టిల్లు చేర బోదు;
దయ ఉంచు, పది వేల దండముల్ పెట్టెద,
సెల'విమ్ము, పు'ట్టిల్లు చేర బోదు;
సెలవు, ముమ్మాటికిన్ సెల'విమ్ము సెల'విమ్ము
సెల'విమ్ము, పు'ట్టిల్లు చేర బోదు,"
అనుచు ఈశుని కాళ్ళకును తాను సాగిలి
సాగి పోవగ సాగె శైలకన్య,

శర్వాణి ఈ లాగు సాగి పోవుట చూచి
    సంభ్రమంబున లేచి శంకరుండు,
"నిలువవే కోమలీ, నిలువవే," అని పరు-
    గున పోయి కేల్పట్టుకొనుచు నిల్పి,
సందిటన్ పట్టి, ఆ సకియను కొని తెచ్చి
    సుమశయ్యమీంద కూర్చుండ బెట్టి,
మోము చెమ్మట బాపి, ముంగురు లెగదువ్వి,
    సరుల చిక్కు-డలించి సరిగ చేసి,
మనస్సు కరగించి, మక్కువతోడ లా-
    లన చేసి శంకరుం డనియె నిట్లు:
"హరిపరమేష్ఠులకైన నను వెరువని
    వాడను, వెరచుచున్నాడ నీకు;
తప్పు చేసితి నంచు ఒప్పుకొనుచు నుంటి,
    కరుణతో తప్పును గడుపుమంటి;
ఒడబడ్డ నన్నిట్లు చెడనాడ తగునటే?
    నీ వెరుగని యట్టి నీతి కలదె?
పతి చేయు తప్పును బయటపెట్టని యట్టి
    సతియే కదా పతివ్రత యనంగ?
నీ వంటి ఇల్లాలు నీ వంటి గుణవతి
    కలదె పద్నాల్గు లోకములలోన?
హరి కాంత శ్రీసతి, అజు కాంత భారతి,
    నీతోడ సరిపోల నేర్తు రొక్కొ?

పరమపతివ్రతాభామినీమణివి, నన్
కాచి నా తప్పును గడపవలదె?
మన ఇద్దరికి ఒకే తనువు కదా అర్ధ-
నారీశ్వరుండను పేరుబట్టి?
నా తప్పు నీ తప్పు, నా కీడు నీ కీడు,
నా గొప్ప నీ గొప్పగాగ నమ్మ;
నీ వెన్క నే నాకు ఏ వనితయు కూడ;
ఎవతె నీకంటె నాకెక్కువౌను?
ఆడి తప్పిన వాడు హరుడంచు నాకప-
నింద తెప్పించుట నీకు తగునె?
తగునని గంగను మిగులంగ తెచ్చితి,
పొమ్మనుటెంత లోపమ్మొ చూడు;
లోపమైనట్టి మాటా పల్కుమందువు?
నాదు లోపము నీది కాదె చెపుము;
భామ, కైలాసపు పట్టంపు దేవివీ-
వే, ఇట అధికారమెల్ల నీదె;
నీ ఇల్లు, నీ సొమ్ము, నీ మాట, నీ ప్రజల్,
నీ అధికారమన్నిటను చెల్లు;
కలము చేతను గాని గురుతుచే గాని జా-
లరి గంగ నీతోడ సరి ఎటౌను?
మదిలోన ఇక అరమరలెల్ల మాను, నీ
సెలవు నే దాటను కలను గూడ;

నమ్మ ముమ్మాటికి నా మాట, నీదు ప్రా-
ణమ్మె నా ప్రాణమ్మ సుమ్మ కొమ్మ;
కలనైన నేను నీ సెలవు దాట," నటంచు
బాసలొనర్చె ఆ పరమశివుడు.
అగ్నిసాక్షిగ బాసలపుడీశ్వరుడు చేయ
మారు మాటాడక గౌరి నిలిచె;
మారు మాటాడక గౌరి నిల్చెనటంచు
సంతోషమును పొందె శంకరుండు.
అఖిలలోకములు మాయను ముంచుచున్నట్టి
శివుడు గౌరిని మాయ చేయ లేడె?
ఇద్దరొక్క విధాన ఇష్టవాక్యములతో
ప్రొద్దు పుచ్చిరి రాగభోగములను.
వారి సంతోషంబు వారి సంభాషణల్
కని వినినట్టి శ్రీగంగకపుడు
కడుపులో చెయి పెట్టి కలిపినట్లాయె, బ-
ల్లెములతో పొడిచిన లీలనాయె;
సవతిపై పుట్టు రోషమును పట్టగ లేక
జడలపై నురికి ఈశ్వరుని కనియె:
"శాబాసు! శంకరా, సకలవశంకరా,
ఇంత ఘనుండవం చెరుగనైతి;
గౌరప్పచే నను కాని మాటలనెల్ల
ఆడించినాడవన్యాయముగను.

గౌరప్ప నను పూని కొఱ్ఱ తన్నెద'నని
రాగ, నీ జడలలో దాగినాను;
కనుల చూచు'టె కాని కాదు పో'దన'నైతి'-
వెదురు చెప్పగ లేక బెదరి బెదరి;
తెలిసె నీ గుణ'మెల్ల నేట తెల్లంబుగా,
దిగ'కుండగా లోతు తెలియదు గద?
సవతి మీది బ్రతుకు చందంబు కా'దని
తల్లి పల్కినది సత్యం'బె అయ్యె.
ఇల్లాలు నీ'కింత బెల్లపు కుం'డైన,
ఏల తెచ్చితివి న'న్నాలిమీద?
ఇంత చాలని వాడ'వేల తెచ్చితివి న'-
న్నెలూరి పురమున'కేగు దెంచి?
అఖిలలోకేశుడ'వనుకొంటి'నే కాని
ఇంతికి భయపడు'టెరుగ'నైతి;
బ్రహ్మ వ్రాసిన'యట్టి వ్రా'లిట్టు'లుండగా,
ని'న్ననన్ పని లేదు నీలకంఠ;
నిజముగా నా'కయి నీవు జడియ'నేల?
మూటి'కాలిని బ్రతిమాల'నేల?
గౌరప్ప నన్ను దుఃఖపు మాట'లన'నేల?
తన్న రాగా నేను దాగ'నేల?
తరుచు మీ'రిద్దరు తంటాలు పడ'నేల?
నీ'వె దిక్కని నేను నిల్వ'నేల?

నీ విధేయత'లెల్ల నేను చూడగ'నేల?
చూడ లే'కేదొ నే'నాడ'నేల?
జననంబునుండి పెంచిన తలిదండ్రు' లీ
పిమ్మట కూడ నన్ పెంచ లేర?
నేను పుట్టిన తావు నే చేరి ఉండెద,
నిందు వేడుక మీర'లుండు'డయ్యా;
ఆలి మాటలకు లో'నైన వాడ'వ'టంచు
నే'నెరుంగగ'నైతి నీదు గొప్ప;
సెల'విమ్ము, పు'ట్టిల్లు చేరి నే'నుండెద',"-
నని ప్రణమిల్లె శంభునకు గంగ.
ప్రణమిల్లి గంగ శ్రీపార్వతిన్ పొడగాంచి
ఎదురుగా నిలుచుండి ఇట్లు పలికె:
"ఓ అప్ప, గారప్ప, ఓ భాగ్యముల కుప్ప,
సెబాసునే! నీ'కె చెల్లు గొప్ప!
శంభున'కై వచ్చి చాల తిన్నాను నీ
చీవాట్లు, తిట్లు, నీ చేతి కొట్లు;
పడ జాల ఈ పాట్లు, పది వేలు, పది వేలు;
చా'ల్చాలు'నిట్టి సంసారసుఖము,
సామంతుల కొమార్త'వై మేటి సామంత-
ముస నను సాధించి పోసినావు;
ఇం'తె చేసితివ? మ'రేమి చేసితివ? కా-
నీ, కాని, చూచుకో ఇంకమీద;

మాట'లె'న్నైనను ఏటికి? క్రియ ప్రధా-
నము గదా? చూడు మా'నాన్న'ల్లోన;
నీలకంఠుడు నీవు నిఖిలభోగంబులు
అనుభవించుచు'నుండు'డతిముదమున;
అనుభవించుచు'నుండు','' డని సత్రాయించుచు
ఏగెను గంగ పు'ట్టింటికి'కపుడు;
తల్లిదండ్రులకు వృత్తాంతమున్ చెప్పక
చూడ వచ్చితి'నని సుదతి బొంకె.
గౌరవ్వ గర్వ'మే కరగి దింతు'న'టంచు
హృదయంబులోన ఊహించి గంగ,
జగములోపల కల్గు జలనిధు'లన్నియు
ఇంకి బీటలు పారి ఎండ జేసె:
గంగ ఏభంగిదో కనబడ'కుండగా
మాయ కావించె భూమండలమున.

గంగ చ'న్నట్టి వెన్కను మరునాడు పా-
ర్వతి స్నానమును జేయవలసి వచ్చె;
గౌరీమహాదేవి కైలాసమున ఉన్న
కొలను దగ్గర'కేగె జలకములకు;
కోటి దివ్యాంగనల్ కూడి వెంటను రాగ
కొలను లోపలి'కేగె జలకములకు;

కొలను బీటలు వారి జలముల లే'కుంట'-
కధికవిభ్రాంతురా'లయ్యె గౌరి.
అధికవిభ్రాంతితో ఆ పార్వతీదేవి,
"ఇది ఏమి పాపమో ఎరుగ రాదు;
స్నానంబు చేయగా జలములు లే'," వని
కళవళంబును పొంది గౌరి అపుడు,
దారి బోయెడి వారి'నారసి ఇ'ట్లనె:
"వింటిరా? నే'డొక్క వింత పుట్టె:
ఏమి పాపమొ కాని ఈ వేళ మన ఊరి
కొలకులలోపల జలము లేదు;
స్నానంబు చేయక నే'నెట్టు'లుండుదు?
సాధనం'బేమి? ఓ సఖియలార,
కడు వేగ ము'జ్జగంబుల'కేగి మీరు వా'-
రిధులందు, నదులందు, నిధులయందు,
ఏళ్లయందును, సెల'యేళ్లను, సరసులన్,
కొలకులన్, బావులన్, గుంటలందు,
వెదకి ఉప్పని'వైన, ఉదకముల్ తెండు; ని-
ర్మలముగ స్నాన' మేన్ సలుపవలయు;
నిర్మలస్నానంబు నే సల్ప'కుండ శి'-
వార్చన చేయు'టర్హంబు కాదు;
తొలుత శివార్చన సలుపక'యుండ భో-
జనమును చేయుగా జనదు గాదె?"

అని దాదులకు చెప్ప, ఆ దాదు'లప్పుడు
శాంకరి చెప్పిన చందమునను
తలలపై పసిడి కుండల పెట్టుకొంచును
తిరిగిరి ఛప్పన్న దేశములను;
గంగ, గోదావరి, కావేరి మొద'లైన
నదు'లెల్ల వెదకిరి ఉదకములకు;
కాశీగయాప్రయాగప్రముఖక్షేత్ర-
ముల'నెల్ల వెదకిరి జలములకును;
వెదకి వేసారుచు వెలదు'లందరు కూడి
"ఎంత పింత?" అ'టంచు వింత పడుచు,
కైలాసగిరికిని క్రిమ్మరి గౌరిని
కని దండములు పెట్టి అనిరి ఇట్లు:
"ఓ అమ్మ, మా తల్లి, ఓ జగద్రక్షణీ,
శాంకరీ, శాంభవీ, సర్వజనని,
చెప్పిన తీరుగా ఛప్పన్న దేశంపు
నదుల'నన్నింటిని వెదకినాము;
వెదకి వెదకి చాల వేసారినాము; క-
టా! నదులన్ బుర'దైన లేదు;
ఇంకి బీటలు పారి ఏ'ళ్లెల్ల ఉన్నవి,
ఏమి హేతువో చెప్ప లేము తల్లి;
అరకాళ్లు పొక్కగా తిరిగితి'మే కాని
ఫలియింప'వయ్యో మా పడిన శ్రమలు;

గాలించినాము పద్నాలుగు లోకముల్,
మాయ'మాయెను గంగ మహిని లేదు,'
అని చెప్పగా విని తన'కేమి తోచక
కళవళంబును పొందె గౌరి మనసు;
తన'కేమి తోచ'కుండిన హేతువున గౌరి
చెక్కిట చెయి చేర్చి చిన్నబోయె.
మూడు లోకంబులు పుట్టించు నిర్మాత
గంగామహత్త్వంబు కాన'దయ్యె;
పద్నాల్గు లోకముల్ పాలింప గల మాత
గంగామహత్త్వంబు కాన'దయ్యె;
సామాన్యవనితల చందాన నగజాత
గంగామహత్త్వంబు కాన'దయ్యె.
గంగామహత్వంబు కానగా లేక వి'-
ఘ్నేశ్వరుణ్ పిలిపించి ఇట్లు పలికె:
"నా ముద్దుల కుమార, నా తండ్రి, గణనాథ,
వింటివా? నే'డొక్క వింత పుట్టె:
స్నానంబు చేయగా జలములు లేవు ప-
ద్నాల్గు లోకంబుల నదులయందు;
ఇది ఏమి చిత్రంబు? ఇది ఏమి మాయ? ఇ'-
దేమి కర్మంబొ నే'నెరుగ జాల;
సహజ'మౌ నిర్మలస్నానంబు లే'కుండ,
ఏ రీతి నిలుదు? ఏ'మొనరు ?

వీరశైవాచారవిధు లెట్లు నడుపుదు?
ఏ రీతి జపియింతు తారకంబు?"
అను తల్లితో గణాధిపుఁడనె: "ఓ తల్లి,
ఇది గంగ మాయ, మఱేమి లేదు;
గంగామహాత్మ్యంబు కానఁగా లేక పా-
దములతో ఆమెను తన్ని బోతి;
కోపంబు మదిలోన కాపురం బై ఉండ,
ఇంకించె జలముల నెల్ల గంగ;
గంగామహాదేవి కావించు మాయ యే
కాని వే రొక్కటి కాదు సుమ్ము;
ఆమె సర్వావన, అత్యంతపావన,
మహిమసహిత, పాపరహిత ఆమె;
జాలరి దనుచు నిస్సారంబుగా చూచి
అన రాని మాటల నంటి వామె;
ఎదిరి శక్తి ఎఱుంగ కెగ్గు లాడఁగ నేల?
ఆమె మహాత్మ్యంబు నరయ వైతి;
ఎంచి చూడంగ మీ రెల్ల విధంబుల
సవతులు, మరి మీకు సవతు లేదు;
ఒక ఇంటి బిడ్డలు, ఒకని భార్యలు మీరు
సవతులు, మరి మీకు సవతు లేదు;
హిమవంతు కూతుర వీవు, గంగయు హిమ-
వంతుని వలననే వసుధ గలిగె;

హరుని వామాంగంబునందు నిల్తువు నీవు,
ఉత్తమాంగంబునం దుండు గంగ;
మీకు భేదము లేదు, మీ రిద్ద రొకటియే,
మాల 'మెరుగ' కిట్లు మోస పోతి;
సదుపాయమును తెల్ప జాలు తండ్రి యె,' అని
తాను గౌరియు శివు దరికి చేరి,
కల తెర 'గంతయు తెలుపగా నే మహా-
శ్చర్యంబు నటియించి శంకరుండు:
"ఏమి? ఏమీ జల మే లేక పోయెనే
ఈ రేడు జగముల? ఎంత వింత?
జల మే లేకున్నచో జను లెట్లు మనుదురు?
నీరె ప్రాణాధార కారణంబు;
ఈ వింత పుట్టగా ఇతర మార్గము లేదు,
ఈ మాయ మన గంగదే నిజంబు;
జాలరి గంగతో జగడంబు వద్దని
నే చెప్ప వినదాయె నీదు తల్లి;
కాదు పోదని నేను గట్టిగా చెప్పగా
కోప మెచ్చగ రెచ్చుకొనుచు లేచె;
వినకున్న యపుడు చెప్పిన లాభ మేమని
మారు మాటాడక ఊరకుంటి;
పట్టిసంటికి గంగ పోవుచున్నను చూచి
మారు మాటాడక ఊరకుంటి;

నిలిపిన కలహముల్ కలుగు'నంచును నేను
మారు మాటాడక ఊర'కుంటి;
నిలుప'కే'నూర'కుంటివిని గదా అనియు, మీ
అమ్మ తిట్టినది గదా అనియును,
తాపంబు జనియించి కోపంబుతోడను
గంగ ఈ వింత కల్గంగ జేసె;
నే వెళ్ళి పిలిచిన నా వెంట రాదు, ఆ
గతిని పిల్చుటయు యుక్తంబు కాదు;
అలుకను కల్గించి'నట్టిది మీ అమ్మ,
ఆమె పిల్చిన తప్ప'కరుగుదెంచు;
మీ అమ్మ మాట'లేమియు తిన్నగా నేర,'-
దామె వెంబడిని నీ'వరుగు'మయ్య;
విద్యల నేర్చిన వెరవరి'వాటను
మంచిగా పొదుపుగా మాట'లాడు;
మంచిగా పొదుపుగా మాటాడగా గంగ
అలుకను విడ'నాడి అరుగుదెంచు;
అడకువతో కాలి నడక'నే వెళ్ళుడీ,
కానిచో గంగ అల్కను విడువదు,"
అని తన తండ్రి చెప్పిన గతి గణపతి
పార్వతితో కూడి బయలుదేరె.
కష్ట'మెరుంగని గౌరి గాసిల్లెను,
నడువ నేరని గౌరి నడువసాగె;

సాగెను దారిలో చతికిల బడుచును,
కాళ్ళు పొక్కగ గడగడ'మనుచును,
కొడుకు చే'యూతను కొని ఉస్సు'రంచును,
“హా! ఎంత గతి? ఈశ్వరా,” అటంచు,
ఊళ్ళను పల్లెలు ఏళ్ళను నదులును
అడవులున్ కొండలున్ గడచి గడచి,
గౌరీమహాదేవి గణనాయకునితోడ
ఏలూరి పురి దరి'కేగుదెంచె

ఆ రీతి గంగామహాదేవి వచ్చిన
సంగతి ఆలించి గంగ అపుడు,
తన పట్టణపు నాల్గు దారులు కట్టించె
చేరి ఎవ్వరు ప్రవేశింప'కుండ:
తుమ్మ కంపల ఎల్ల తోవల వేయించె,
పరపించె కుల్లు చేపల అటు పయి,
తలుపులు వేయించి ద్వారంబులందు కా-
వలి ఉంచె భూతాల వంటి బంట్ల.
గౌరీమహాదేవి గణపతితో రాగ
తోవ'కడ్డం'బయ్యె తుమ్మ ముండ్లు;
తుమ్మ కంపల'నెల్ల తొలగించుకొని రాగ
కుల్లు చేపల కంపు కొట్టు'చుండె;

కల్లు చేపలు దాటుకొని పోగ కావలి
బంట్లు పోనీ'రైరి పైకి వారి;
గంగమ్మ ఆనతి కాకుండ రా కూడ'-
దని వచించుచు అడ్డుకొనిరి భటులు.
"కైలాసగిరినుండి గౌరియు గణపతి
అరుదెంచి'రనుచు గంగమ్మతోడ
ఎఱిగింపు','డనుచు గణేశుండు పల్కగా,
వారి'నచ్చట నిల్పి ద్వారభటులు
గణనాథుతో కూడి గౌరమ్మ వచ్చిన
సంగతి తెల్పిరి గంగ'కపుడు.
తల ఊచి ము'మ్మారు తిప్పించి, "గారికి
గర్వభంగం'బయ్యె గద," అ'టుంచు
తలపోసి, గంగమ్మ ద్వారపాలురతో గ'-
ణాధిపు పిలువగా ఆజ్ఞ ఇచ్చె.
ఆ మాటలు విని గౌరి'నచ్చట'నే నిల్పి
గణపతి చనియె గంగమ్మ కడకు;
గణనాయకుని చూచి గంగామహాదేవి
కడు వేగ ఎదు'రేగి కౌగిలించి,
చెక్కిలి ము'ద్దాడి, మక్కువతో చీర
చెరగున నె'మ్మోము చెమట తుడిచి,
పన్నీట అతని పదములు కడిగించి
సొగసు గద్దియను కూర్చుండ బెట్టి,

వింజామరలతోడ విసరించి, అలసట
తొలగించి గంగమ్మ పలికె నిట్లు:
"నా తండ్రి, ఓ గణనాథ, నీ విట్టి రీ-
తిని కాలి నడక నేతేర నేల?
నీ తల్లి గౌరమ్మ నీతోడ వచ్చిన-
దట, ఏమి పని ఉండి అరుగుదెంచె?
ఈ నీచు కొంపల కేల తా వచ్చెను,
వాసి కల్గిన ఇంటి వారి బిడ్డ?
జాలరి కొంపల కేల తా వచ్చెను,
పేరు కల్గిన గొప్ప వారి బిడ్డ?
హీనజాతుల యిండ్ల కేల తా వచ్చెను,
పరువు కల్గిన దొడ్డ వారి బిడ్డ?
పరువు మర్యాద లోపముగ గౌరవ్వ నీ-
చంపు కొంపలను కాలుంప తగునె?
తగని కొంపల కట్టి తరుణి రా కూడ'ద'-
టంచు రమ్మని పిల్వ నైతి కొడుక;
పగ చేత నో గర్వభావంబున నొ పిల్వ-
నైతి నంచు తలంప కయ్య తండ్రి,"
అని కంటసపు మాట లాడిన గంగతో
ఈ గతి పల్కె గణేశ్వరుండు:
"పదునాల్గు లోకముల్ పావనంబును చేయ
గల యట్టి తల్లి, గంగామతల్లి,

జీవనంబుల'కెల్ల జీవనంబవు నీవు,
ఎల్ల లోకములు నీవల్ల నిలుచు;
నీవు లే'కున్నచో నిలువగా జాలక
ఎల్ల లోకంబులు తల్లడిల్లు;
నీ శక్తి ఎరుగంగ నేరక మా అమ్మ
అన రాని మాటల'నాడె నిన్ను;
ఆడి'నందుకు ఆమె అతిశయ'మణగించి
గంగలోపల నీవు కలిపినావు:
నీ మాయ చేత'నే నిఖిలలోకంబుల
ఏరులున్ చెరువులున్ ఇంకి పో'యె;
స్నానంబు చేయ మా జనని గౌరికి ఒక
దోసెడు నీ'ళ్లైన దొరక లేదు;
ఆమె మా జనకునితో మొర పెట్ట ఆ-
లింప'డాయె, మరి పాలింప'డాయె;
ఐదు దినంబు'లై ఆమెకు స్నానంబు
లేదు, శివార్చన లేదు, రామ-
నామమంత్రస్మరణంబును లేదు, ని-
ద్రాహార సౌఖ్యము'లైన లేవు:
నీ మహత్వ'మెరింగి నీ'వె దిక్కు'వని నిన్
వేడంగ వచ్చె నా వెంట ఆమె;
ఆమెపై కోపంబు అణగించుకో'న'వమ్మ,
కఠినత్వమును మాని కనికరింపు;

ఆమెపై కోపంబు అణగించుకొనకున్న
        అఖిలలోకంబులు అణగి పోవె?
జలములు లేమిచే సకలజగంబుల
        జనులు కనులు వ్రేలి చత్తురమ్మ;
ఇనుము నిమిత్తమై అనలంబు సమ్మెట
        దెబ్బల పాలైన తెరగు తోచె;
మీ రిరువురు ఇట్లు పోరాడుచున్నచో
        లోకంబు లెల్ల కల్లోలమగును;
గౌరమ్మ నిన్ను అగౌరవమును చేయ
        లోకుల తప్పేమి? లోకజనని,
బింకంబుచే తల్లి బిడ్డల చంపుకో-
        నంగ భావించుట న్యాయమౌనె?
దయ జూడు దయ జూడు ధరణీజనంబుల,
        కరుణించు కరుణించు గౌరి నింక;
నీ ఆజ్ఞ తప్పక నిలిచె వాకిట నామె,
        కరుణించు కరుణించు గౌరి నింక;
నీవు చెల్లెల, వామె నీకంటె పెద్దది,
        కరుణించు కరుణించు గౌరి నింక;
లోకేశు భార్యలు లోకమాతలు మీరు,
        మీ రిద్దరొకటిగా మెలగ వలయు;
తప్పొప్పుకొని నీదు దరిని చేరిన దాని
        చులకన చేయుట చొప్పు కాదు;

పగ'లెల్ల మరచి కోపము విడ'నాడి, క్ష-
మించుట'యే సుమ్ము మేటి గుణము;
ఇన్నరా'త్రై గౌరి ఉన్నది వాకిట,
పిలువ గ'దమ్మ, లోపలికి నీవు,''
అని గణనాథుండు తనతోడ బోధింప,
ఆగ్రహంబును విడ'నాడి గంగ
కడు నడిగా లేచి కొడుకు వెంబడి'నేగి
వాకిట'నున్న పార్వతిని చూచి,
పాదపద్మములకు ప్రణమిల్లి నిలుచుండి
"దయ కల్గెనా నీకు తల్లి?" అనుచు
తోడ్తెచ్చి, బంగారు తూగు'టుయ్యాలమీద
కూర్చుండగా బెట్టి, కూర్మితోడ:
"ఓ అమ్మ, గౌరమ్మ, ఒకతె'వే గణనాథు
కూడి వచ్చితి', వెందుకోర'కిచటికి?
హీనస్థలం'బిది, ఏల వచ్చితివి? కా'-
ల్నడకను వచ్చుట న్యాయ'మానె?
పని'యున్న'యెడ దాసజనులచే కబు'రంప-
గ'నె చేతులను కట్టుకొనుచు రానె?
రాణివాసపు స్త్రీవి, రా దగునే ఇట్టి
చోటుల'కెల్ల మా బోటులవలె?"
అని గంగ పలుకంగ అపుడు గౌరీదేవి
పొలతి చేతులను చేతులను పట్టి:

"చెల్లెలా, గంగ, నీ'వెల్లరి తల్లివి,
నీ శక్తి నే చెప్ప నేర'నైతి;
సిగ్గుతో వచ్చితి: ఎగ్గు'లెంచగ బోకు,
పెద్దదానను నేను పిన్న'వీవు;
నీ'వే గతి'య'టంచు నే వచ్చి నిలిచితి,
నా కార్య'మీ'వె ఒనర్ప వలయు;
ఐదు దినంబు'లై ఆహార'మెరుగను,
శ్రీశివార్చనయును చేయ లేదు;
జలములు లే'కున్న జరుగవు కార్యముల్,
జలము'లిమ్మా లోకజనని, గంగ,"
అనుచు గడ్డము పట్టుకొని గౌరి వేడగా,
మవ్వంపు చిరునవ్వు నవ్వి గంగ
ఆదరంబునను గౌరీదేవి'నొక్క ప-
సిండి గద్దియను కూర్చుండ బెట్టి,
"నలుగు పెట్టు," 'డ'టంచు నెల'వియ దాదులు
పసిడి పీటను వేసి పార్వతికిని,
సంపంగి నూనెయు జవ్వాదియును కూర్చి
అతిసుఖంబుగ తల'యంటి అంటి,
నలుగును కొని తెచ్చి నలిచి'రంతటను గౌ-
రీమహాదేవి శరీరమునకు;
గంగ'యాజ్ఞను జేసి పొంగి పారుచు'నున్న
గంగానదిని చెలి నీ'లరిగి,

జలములు పసిడి కుండలతోడ తెచ్చి స్నా-
నంబు చేయించిరి నగతనయకు;
తడి వస్త్రములు విప్పి, దాదులొసంగిరి
కట్టుకొనన్ పట్టు బట్టలుమకు;
పొడి వస్త్రములతోడ తడియొత్తి చక్కగా
పెన్నెరులారంగ బెట్టిరపుడు:
గౌరమ్మ ఇటు జలకంబులనాడి, అ-
త్యంతము మదిలోన సంతసించె;
అత్యంతముదమున అప్పచెల్లెండ్రును
పరగుచుండిరి అరమరలు లేక.

శంఖుదేవయ్యాయు చక్రమ్మయును పార్వ-
తీదేవి వచ్చిన తెరగునెరిగి,
ఆ మహాదేవికి అత్యంతమగు ఆద-
రంబుతోడను గౌరవంబు చేసి,
గంగచేతులనామె కరముల పెట్టి, "పా-
లించుమీ," అని అప్పగించిరపుడు;
"నీ బిడ్డయే కాని మా బిడ్డ కాదీమె,"
అంచు పల్కుచు అప్పగించిరపుడు;
"తప్పు కల్గిన వేళ తలిదండ్రులెల్ల మ-
న్నించు," మనుచు అప్పగించిరపుడు:

"మీరా బిడ్డలము, మేము తోబుట్టువుల," మంచు
గౌరీమహాదేవి మారు పలికె.

తమ కొనిపోవగా ప్రమథులు శంకరు-
నాజ్ఞచే ఏలూరికరుగుదేర,
గణనాథు వెంబడి కైలాసశిఖరికి
గౌరియు గంగయు చేర జనిరి;
కలహములను లేక గౌరియు గంగయు
హరుని కలిసియుండిరంతనుండి:
మంగళము లెసంగె గంగకున్ గౌరికిన్:
మంగళము లెసంగు మహికి నెల్ల! 888.

సమాప్తము.

PRINTED AT THE ALMA PRESS, VIZAG.

| | | |
|---|---|---|
| హేమలత | ... ... ... | 0- 8- 0 |
| అహల్యాబాయి | ... ... ... | 0- 8- 0 |
| రామచంద్రవిజయము | ... ... | 0- 8- 0 |
| కర్పూరమంజరి [ప్రథమభాగము] | ... | 0-12- 0 |
| రాజస్థానకథావళి. 2 భాగములు. ఒకొకటి | | 0-12- 0 |
| ప్రసన్నయాదవము [నాటకము] | ... | 0- 8- 0 |
| మహాపురుషుల జీవితము, 3 భాగములు. ఒకొకటి | | 0-12- 0 |

## ఆకెళ్ల సత్యనారాయణవిరచితములు.

| | | |
|---|---|---|
| జయంతజయపాలము [నాటకము] | ... | 0- 8- 0 |
| పేష్వానారాయణరావు వధ [నాటకము] | | 0- 6- 0 |

## ఇతరగ్రంథములు.

| | | |
|---|---|---|
| కృష్ణార్జునచరిత్రము [ద్విపద] | ... | 0- 8- 0 |
| మొల్లరామాయణము | ... ... | 0- 8- 0 |
| భారతము [దళసరి కాగితము కాలికోబైండు] 18 పర్వములు, 8 వాల్యూములు. ఒకొక వాల్యూము. | ... | 1-12- 0 |
| ఆంధ్ర మహాభాగవతము [2 వాల్యూములు] | | 4-12- 0 |
| భర్తృహరి [శ్లోకములు, సటీక] | ... | 2- 0- 0 |
| మనుచరిత్రము | ... ... ... | 1- 8- 0 |
| భాస్కర రామాయణము [చకర్నివ్రతి] | | 2- 8- 0 |
| ఆముక్తమాల్యద [సటీక, అట్టబైండు] | ... | 2- 8- 0 |
| వసుచరిత్ర, సటీక [దళసరి కాగితములు | | 2- 8- 0 |
| కళాపూర్ణోదయము [దళసరికాగితములు] | | 1- 8- 0 |
| అప్పకవీయము [అట్టబైండు] | ... | 1- 6- 0 |
| శృంగారనైషధము | ... ... | 0-10- 0 |

## సెట్టి లక్ష్మీనరసింహావిరచితములు.

1. శ్రీరుక్మిణీకళ్యాణనాటకము ... 0- 8- 0
2. మాలినీవిజయనాటకము, కీచకవధ ... 0- 8- 0
3. చిత్రహరిశ్చంద్రీయము, నాటకము 1- 0- 0
4. శ్రీకృష్ణలీలాతరంగిణి [చక్కనికల్పనలు] 0- 2- 0
5. రసికాభిలాషము. విమర్శనలు ... 0- 2- 0
6. సాధువాక్యములు (చక్కనినీతిపద్యములు) 0- 2- 0
7. బప్పడు [రాజస్థానపు పదములు] ... 0- 4- 0
8. పద్మిని [రాజస్థానపు పదములు] ... 0- 4- 0
9. గంగ [పద్యగ్రంథము] ... 0- 4 -0
10. లుబ్ధాగ్రేసరచక్రవర్తి [హాస్యనాటకము, కన్యాశుల్కముతో తులతూగును.] 0- 8- 0
11. గీర్వాణకథలు (వచనము) 1వ భాగము 0-12- 0
12. గీర్వాణకథలు, 2వ భాగము [స్కూలు ఫైనల్ టెస్టు ... ... 0-12- 0
13 హిందూపురాణకథలు, పండుగకథలు 0- 4- 0
14. వసంతసేన [అపూర్వమైన పెద్దనవల] 2- 0- 0

సురుచీవిజయము, సీరము సుభద్రయాంబా విరచితము ... ... 0- 6- 0

పై 3 పేజీలలోని పుస్తకములును, ఇంకను తక్కిన ఆంధ్రగ్రంథములును, బడులలో ఉపయోగించు ఇంగ్లీషు తెనుఁగు పుస్తకములును, నోటుపుస్తకములును మావద్ద ఉచితమైన వెలలకు దొరకును.

చర్చివార్డు, విశాఖపట్టణము. } బీ. రామయ్య అండ్ కంపెనీ.